
రామ్, శ్యామ్‌లు
ప్రఖ్యాత స్మగ్లర్లను పట్టేశారు


రామ్, శ్యామ్‌లు నడుస్తున్నారు
సరదాగా, ఆగిచూసారు
ఓ వింత దృశ్యం కనపడగా


"చూడు, రామ్!
అతనుదొంగ కాదు
అతనే స్మగ్లర్ల నాయకుడు?"


"త్వరపడండి ఇన్స్పెక్టర్
ఈ దారిన పదండి, త్వరగా
ఆ స్మగ్లర్లను పట్టుకోండి."


పరిగెత్తుతున్నారు స్మగ్లర్లు కాలిసత్తువ కొద్దీ
కాని అంతలోనే జారిపడ్డారు అదేమిటో.


"నేనునేలపై జార్చిన పాపిన్స్
అందుకు కారణం, విప్పి మనమూ
తిందాం మజా మజాగా ఈక్షణం!"


PARLE
POPPINS
MIXED FRUITY SWEETS





---









SREE 77
SREE 689

# చందమామ

సంస్థాపకుడు : నాగిరెడ్డి
సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ నెల బేతాళకథ [''సౌందర్య పిపాస''] వీరేపల్లి జయరాంరెడ్డి రచన.

దేవుళ్లకు మొక్కుకోవటంలోనూ, ఆ మొక్కులు చెల్లించటంలోనూ ఒక చిత్రమైన మనస్తత్వం ఉన్నది. దేవుళ్లకు మన కోరికలు తీర్చే అమానుష శక్తులు ఉన్నాయి గాని, మనం మొక్కుగా చెల్లించుకునే కొబ్బరికాయలో, గొర్రెపొట్టేళ్ళో సంపాదించుకునే శక్తులు లేవన్నమాట! దీన్ని ''చెల్లించని మొక్కు'' చిన్న కథ చక్కగా బయటపెడుతున్నది.

సంపుటి 57 సెప్టెంబర్ '75 సంచిక 3




CHITRA



# మిత్రభేదం

## 27

దుష్టబుద్ధి తన నూరుబంగారు కాసులనూ త్వరలోనే ఖర్చు చేసుకుని, డబ్బుకోసం తహతహలాడుతూ ధర్మబుద్ధి వద్దకు వెళ్ళి, అతన్ని వెంట బెట్టుకుని డబ్బుదాచిన చోటికి వెళ్ళాడు. ఇద్దరూ మళ్ళీ చెరొక నూరు కాసులూ తీసుకున్నారు. కాని సంవత్సరం తిరిగే లోపల దుష్టబుద్ధి ఆ డబ్బంతా, తన దుర్వ్యసనాలకు ఎడాపెడా ఖర్చుచేసేశాడు.

దుష్టబుద్ధి ఉద్దేశం ఇలా ఒకటి రెండు సార్లు ఆ డబ్బును ధర్మబుద్ధితో పాటు తీసుకుని, అతనికి నమ్మకం కలగనిచ్చి, అంతా తానే కాజేయాలని. ఇప్పుడు దాచినచోట ఇంకా అరువందల కాసులు మిగిలి ఉన్నాయి. అదంతా తానే సంగ్రహించాలనే ఉద్దేశంతో అతను అర్ధరాత్రి వేళ డబ్బుదాచిన చోటికి వెళ్ళి, పాత్ర నుంచి అరువందల బంగారు కాసులూ తీసుకుని, పాత్రకు మళ్ళీ మూతి కట్టి, దాన్ని ఎప్పటిలాగే పాతిపెట్టి, ఇంటికి వచ్చేశాడు.

ఒకనెల గడవనిచ్చి అతను ధర్మబుద్ధి వద్దకు వెళ్ళి, ''మిత్రమా, మిగిలిన డబ్బుకూడా పంచేసుకుందామా? కాస్త డబ్బు అవసరంలో వున్నాను,'' అన్నాడు. ధర్మబుద్ధి సరే నన్నాడు.

ఇద్దరూ డబ్బుదాచిన చోటికి వెళ్ళారు. పాత్రను తవ్వి తీసిచూస్తే అందులో ఏమీలేదు. దుష్టబుద్ధి ఆ పాత్రతో తన తల బాదుకుని, ''అయ్యో, ధర్మబుద్ధీ! డబ్బంతా కాజేశావా? నా వంతు నా కిస్తే ఇచ్చావు, లేకపోతే ఇప్పుడేపోయి న్యాయ స్థానంలో నీ మీద వ్యాజ్యం తెస్తాను,'' అన్నాడు.

అట్ట చివరి బొమ్మ

"ఛీ, బుద్ధిహీనుడా! నేను అలా దొంగ తనానికి పాల్పడే నీచుణ్ణికాను," అన్నాడు ధర్మబుద్ధి.

ఇద్దరూ పోట్లాడుకుని, న్యాయస్థానానికి వెళ్ళి ఒకరిపై ఒకరు ఫిర్యాదు చేసుకున్నారు.

ఇద్దరి పక్షానా సాక్షులెవరూ లేని కారణంచేత న్యాయాధికార్లు వెంటనే తీర్పు చెప్పలేక, ఇద్దరినీ అయిదు రోజుల పాటు నిర్బంధంలో ఉంచారు.

ఆరవనాడు న్యాయాధికార్లు ఇద్దరినీ అగ్నిపరీక్షకు గురిచేస్తామన్నారు. దుష్ట బుద్ధి ఇందుకు ఆక్షేపణచెబుతూ, "ఇది ధర్మంకాదు. పత్రాలూ, సాక్షులూ లేని పరిస్థితిలోనే అగ్నిపరీక్ష విధించాలని ధర్మ శాస్త్రాలు చెబుతున్నాయి. ఈ సందర్భంలో మేము ధనం దాచినచోట వృక్షదేవత సాక్ష్యం ఇయ్యగలదు. మాలో ఎవరు దోషి అయినదీ ఆ వృక్షదేవత చెబుతుంది. ఆ సాక్ష్యం విని తమరు తీర్పు ఇయ్యవచ్చు," అన్నాడు.

న్యాయాధికార్లు ఇందుకు సమ్మతించి, మర్నాడు వాళ్ళను వెంటబెట్టుకుని చెట్టు వద్దకు వెళ్ళి, వృక్షదేవత సాక్ష్యం వినటానికి నిర్ణయించి, ఇద్దరినీ తగిన హామీ మీద వదిలిపెట్టారు.

దుష్టబుద్ధి తిన్నగా ఇంటికి వెళ్ళి, తన తండ్రితో, "నాన్నా, సొమ్ము నేనే తీశాను. నువు ఒక్కమాట అనగలిగితే అది మనకే ఉంటుంది. ఇవాళ రాత్రి



నిన్ను చెట్టు దగ్గిరికి తీసుకుపోతాను. నువు చెట్టుతొర్రలో దాక్కుని, రేపు న్యాయాధికారులు వచ్చి, డబ్బు ఎవరు తీశారని అడిగినప్పుడు ధర్మబుద్ధే తీశాడని చెప్పాలి," అన్నాడు.

దానికి అతని తండ్రి, "ఒరే బాబూ, ఇలాటి దుష్టపథకాలవల్ల ఇద్దరమూ నాశనమవుతాం. వివేకంగలవాడు ఏ పథకం వేసినా అందులోని లోపాలు ఎలాంటివో జాగ్రత్తగా ఆలోచించాలి. లేకపోతే కొక్కిరాయి గతి అవుతుంది?" అన్నాడు.

"కొక్కిరాయికి ఏమయింది?" అన్నాడు దుష్టబుద్ధి.

తండ్రి కొక్కిరాయి కథ ఇలాచెప్పాడు:

ఒక అరణ్యంలో ఒక మర్రిచెట్టు తొర్రలో కొక్కిరాయి దంపతులు ఉండేవి. దాని దిగువన బొరియలో ఒక నాగుపాము ఉండేది. ఈ పాము చెట్టుతొర్రలోకి ఎక్కి, రెక్కలురాని ఒక కొక్కిరాయి పిల్లను మింగేసి వెళ్ళిపోయింది.

అదిచూసిన కొక్కిరాయి చెరువుగట్టున కూర్చుని ఏడుస్తూండగా, ఒక పీత చూసి, "ఎందుకు, మామా, ఏడుస్తున్నావు?" అని అడిగింది.

"పాపిష్ఠిపాము మా చెట్టు కింది బొరియలో ఉంటున్నది. అది ఇవాళ నా పిల్లను ఒకదాన్ని తిన్నది. రేపు మిగిలిన పిల్లల గతి అంతే అవుతుంది. ఏడవక ఏం చెయ్యను?" అన్నది కొక్కిరాయి.

తన శత్రువైన కొక్కిరాయిని నాశనం చెయ్యాలన్న ఉద్దేశంతో పీత, "చూడు, మామా. ముంగిస ఉండే బొరియ నుంచి పాము బొరియ దాకా చేపముక్కలు వెయ్యి. ముంగిస వాటిని తింటూవచ్చి, పామును చంపుతుంది," అని ఉపాయం చెప్పింది.

అందులో కీడు ఆలోచించక, బుద్ధిలేని కొక్కిరాయి అలాగే చేసింది. ముంగిస వచ్చి పామునైతే చంపింది, కాని చెట్టు తొర్రలో ఉన్న మిగిలిన కొక్కిరాయి పిల్లలను కూడా చంపి వెళ్ళిపోయింది.





**15**

[ రాక్షసుడు తనకు అవసరం అయిన కవలలు దొరికారనీ, వాళ్ళను బలియిచ్చి దేవిని ప్రత్యక్షం చేసుకోవచ్చనీ సంతోషించాడు. కాని, తీరా బలి సమయానికి రాకుమార్తెలు ముగ్గురూ వాడికి అంగవైకల్యంతో కనిపించారు. వాడు తన భటులను హెచ్చరించి, గద్దగా మారి, ఆ ముగ్గురినీ ఎత్తుకుని ఆకాశంలోకి ఎగిరిపోయాడు. తరవాత—]

ఉదయనుడు అలా అదృశ్యరూపంలోనే వుండి, ముందుగతి ఏమిటా అని తీవ్రంగా ఆలోచించసాగాడు. పాతాళభవనం లోకి పోదామంటే, అక్కడ తన భస్మాలూ, అంజనాలూ పనిచెయ్యవని రాకుమార్తెలు లోగడ చెప్పారు. అయినా, అదీ ప్రయత్నం చేసి చూద్దాం అనే కుతూహలంతో ఉదయనుడు వెళ్ళి, అక్కడ వున్న ఆకులగుట్ట తొలిగించాడు.

ఉదయనుడికి ఒక సొరంగమూ, దాని లోపలికి పోయేందుకు మెట్లూ కనిపించాయి. అతడు ఒక్కొక్క మెట్టే దిగుతూ పోయాడు. పదిమెట్లు దిగేసరికల్లా, అతడికి అదృశ్యరూపం పోయి మామూలు రూపం వచ్చేసింది. అయితే అతడు జంకిపోయి అంతటితో ఆగలేదు. మరో పది మెట్లు దిగాడు. అంతే, అడుగు ముందుకు పడలేదు! మెట్ల దిగువున భయంకరమైన



రెండు సింహాలు వున్నవి. అంతకంటే భయంకరమైన రెండు సర్పాలు వాటి మెడలకు చుట్టుకుని, బుసలుకొడుతున్నవి. ఇవి కంటబడగానే ఉదయనుడు క్షణమైనా అక్కడనిలవక, ఒక్క ఉరుకున సారంగం బయటికి వచ్చి, తిరికి అదృశ్యరూపం పొందాడు.

ఉదయనుడు అక్కడినుంచి సరాసరి కొలను వద్దకు వచ్చాడు. కొలనుచుట్టూ అగ్నిగుండాలు భుగభుగ మండుతున్నై. రాక్షసుడి పరివారం జాగ్రత్తగా కాపలా కాస్తున్నారు. వికార రూపులైన రాకుమార్తెలను రాక్షసుడు ఎత్తుకుపోయిన సంగతి ఉదయనుడికి తెలియనే తెలియదు.

ఐతే యాదాలాపంగా లెక్కపెట్టేసరికి, కొలనులో నలభై ఎనిమిది హంసలకు బదులు, ఇప్పుడు నలభైఅయిదుమాత్రమే వుండటం చూచి సంశయంలో పడ్డాడు. లోపించినది ఆ ముగ్గురు రాకుమార్తెలే అనీ, వారికి ఏదో ప్రమాదం సంభవించి వుంటుందనీ అనుకున్నాడు. అయితే చేసేదేముంది? ఎవరినడిగితే నిజానిజాలు తెలుస్తవి? అదృశ్యరూపం మార్చి మామూలుగా కనిపించాడా, రాక్షస పరివారం తనను పట్టేస్తారు. ఏదోవిధంగా కొలనులోకి చేరుకుని హంసరూపం పొందుదామన్నా, కొలను చుట్టూ అగ్ని జ్వాలలు భగభగ మండుతున్నై.

ఈలోపల రాక్షసుడు తాను ఎత్తుకుపోయిన సుహాసినీ, సుభాషిణీ, సుకేశినీలను ఒక మహారణ్యంలో వదిలేశాడు. వెళ్ళేముందు, వాళ్ళు తన మాయాభవనం రహస్యాలు బయట పెట్టకుండా వుండేందుగ్గాను, వాళ్ళను మూగవాళ్ళుగా చేశాడు. అసలే అంగవైకల్యం ఏర్పడివున్న రాకుమార్తెలకు, యిలా మూగతనం కూడా ప్రాప్తించటంతో, వాళ్ళు దిగులుతో తల్లడిల్లిపోయారు. ఏదోవిధంగా అరణ్యం నుంచి బైటపడదామంటే, కాలుపోయిన సుభాషిణీ, కళ్ళుపోయిన సుకేశినీలతో నడవటం సుహాసిని వల్ల కాలేదు.

అదృష్టవశాత్తూ వాళ్ళున్న ప్రాంతానికి ఒక రాజు వేటకై వచ్చాడు. రాకుమార్తెలు అతడికంట బడ్డారు. అపురూప సుందరులైన ఆ పిల్లలకు యిలా అంగవైకల్యం ఏర్పడి వుండటం గమనించి ఆయన ఆశ్చర్యపోయాడు.

"ఎవరు మీరు? ఎందుకని యీ మహారణ్యం మధ్య సంచరిస్తున్నారు?" అని రాజు వాళ్ళను ప్రశ్నించాడు. కాని, మూగవారైన రాకుమార్తెలు ఆ ప్రశ్నకు జవాబు చెప్పలేక, చేతిసంజ్ఞల ద్వారా తమ స్థితి తెలియచెప్పేందుకు ప్రయత్నించారు.

రాకుమార్తెల అవస్థ చూసి రాజు, "పాపం, వీళ్ళు అంగవైకల్యంతో పాటు మూగవాళ్ళుకూడానా!" అంటూ ఎంతో జాలిపడ్డాడు.

తరవాత ఆయన వాళ్ళతో, "అమ్మాయిలూ, చూడగా మీరు ముగ్గురూ పెద్ద కుటుంబానికి చెందినవాళ్ళుగా కనబడుతున్నారు. ఏదో గట్టి కారణంవల్లనే మీరు, ఈ దుస్థితిలో వుండి వుండాలి. మీకు వచ్చిన భయం ఏమీలేదు. నా వెంట తీసుకుపోతాను. మీ ఇంట్లో ఎంత స్వేచ్ఛగా వుండేవారో, అంత స్వేచ్ఛగానూ మీరు నా కోటలో వుండవచ్చు. నేను మాళవదేశపు రాజును. నా పేరు ప్రతాపసింహుడు," అని ధైర్యం చెప్పాడు.

ఈ మాటలు వింటూనే కష్టాలపాలైన రాకుమార్తెల ముఖాలు వికసించినై. రాజు





వాళ్ళను తన గుర్రంమీద ఎక్కించి, తను దాని వెంట బయలుదేరాడు.

మరికొద్దిసేపటికి సుహాసినీ, సుభాషిణీ, సుకేశినీలతో సహా రాజు తన భవనం చేరుకున్నాడు. వెంటనే ఆస్థాన విద్వాంసుణ్ణి రప్పించి, రాకుమార్తెల వృత్తాంతం తెలుసుకునే మార్గం ఏదైనా వుందేమో ఆలోచించమన్నాడు.

ఆస్థాన విద్వాంసుడు బుద్ధిబలం అంతా ఉపయోగించి ఎంతో ఆలోచించిన మీదట ఒక ఉపాయంతోచింది. అతడు కొంత ఇసుక తెప్పించి, రాకుమార్తెల ముందు పోయించి, దాన్ని బాగా చేత్తో చదునుచేసి, రాయమన్నట్టు సుహాసినికి సంజ్ఞచేశాడు.

సుహాసిని కన్నీరు కార్చుతూ, చదువు నేర్చిన వాళ్ళంకాము, అనే అర్థమిచ్చేలా తిరిగి సంజ్ఞ చేసింది. తనేదో గొప్ప ఆలోచన చేశాననుకున్న ఆస్థాన విద్వాంసుడు, సుహాసిని యిలా సంజ్ఞ చేయగానే తల వేలాడవేశాడు.

''మహారాజా! నా బుద్ధికి తోచిన ఒక్క ఉపాయమూ ప్రయోగించాను కాని, మాట దక్కలేదు. ఇంతకుమించి వేరే మార్గం కనిపించటంలేదుకూడా,'' అని ఆస్థాన విద్వాంసుడు రాజుకు విన్నవించుకున్నాడు.

రాజు యిందుకు కొంచెం విచారించి, విద్వాంసుణ్ణి పంపేసి, దాసీలను పిలిచి, ''ఈ ముగ్గురికీ ఏ లోపమూ జరక్కుండా, అతి జాగ్రత్తగా చూస్తూండండి. అంతఃపురంలో వుంచి కంటికి రెప్పలా కాపాడుతూ వుండండి,'' అని ఆజ్ఞాపించాడు.

సుహాసినీ, సుభాషిణీ, సుకేశినిలు రాజుగారి అంతఃపురంలో, ఎలాంటి అసౌకర్యాలూ కలక్కుండా సుఖంగా వుంటున్నారు.

* * *

ఉదయనుడు క్రిందటిమారు శ్రావస్తి నగరానికి వెళ్ళేప్పుడు, ఒకానొక రాజ్యం మధ్యనుంచి ప్రయాణించటం, అక్కడ ఒక అంధుడికి చూపు తెప్పించటం, అది

చూసి ఆ దేశపురాజు అతణ్ణి తన దగ్గిర వుండిపొమ్మనటం జరిగింది. ఇప్పుడు రాజకుమార్తెలను అడవిలో చూసి, తన కోటకు తెచ్చిన రాజు అతడే—ప్రతాప సింహుడు.

వాగ్దానం చేసిన విధంగా ఉదయనుడు తన వద్దకు తిరిగి వస్తాడనీ, అప్పుడు అతని చేత యీ ముగ్గురికీ అంగవైకల్యం పోగొట్టించవచ్చుననీ, రాకుమార్తెలను చూసిన క్షణమందే రాజు మనసులో అనుకున్నాడు.

మరో వారానికల్లా ఉదయనుడు, ఈ మహారాజు వద్దకు రావటం తటస్థించింది. తలవనితలంపుగా అతడు తనంతట తనే వచ్చేసరికి, రాజు బ్రహ్మానంద భరితుడయాడు. ఉదయనుడు తన ఆస్థానంలో వుండిపోయేందుకే వచ్చాడనుకున్నాడాయన.

''వచ్చావా! నీవు ఎప్పుడు వస్తావా అని ఎదురు చూస్తున్నాను. రావలసిన సమయంలోనే వచ్చావు. సంతోషంగా వుంది. నువు వెళ్ళిన పని నెరవేరిందా?'' అని అడిగాడు రాజు.

ఆ ప్రశ్నకు ఉదయనుడు, ''మహారాజా, నేను తలపెట్టిన కార్యం యింకా పూర్తికాలేదు. అందుకే తమ సహాయం కావలసి వచ్చాను,'' అన్నాడు.



''సహాయం కావాలా? ఏమిటది? మొహమాట పడకుండా చెప్పు. నా వల్ల ఎలాంటి సహాయం కావాలన్నా చేస్తాను,'' అన్నాడు ప్రతాపసింహ రాజు.

అప్పుడు ఉదయనుడు తనను గురించీ, తన సోదరులను గురించీ సర్వం రాజుకు చెప్పి, తాను ఆ కనిపించకుండా పోయిన రాకుమార్తెల కోసం వెతుకుతున్నాననీ, తన వద్ద వున్న అంజనాలా, భస్మాలా మహిమ కూడా ప్రతాపసింహమహారాజుకు వివరించాడు.

అంతా విన్న మహారాజు అతణ్ణి, ''అయితే, యిప్పుడు నేను చేయవలసిందేమిటి?'' అని ప్రశ్నించాడు.



"తమ ఆస్థాన చిత్రకారుణ్ణి, ఒక పర్యాయం నాతో పంపాలి. ఇద్దరం వారం రోజుల్లో తిరిగి వచ్చేస్తాం." అన్నాడు ఉదయనుడు.

రాజు సరేనని, చిత్రకారుణ్ణి పిలిపించి, అతణ్ణి ఉదయనుడికి పరిచయం చేశాడు. మర్నాడే ఉదయనుడు, చిత్రకారుణ్ణి వెంటబెట్టుకుని బయలుదేరి, రాక్షసుడి భవనాన్ని చేరాడు. అక్కడ అతడు చిత్రకారుడి పైన భస్మం చల్లి, తనపైన కూడా చల్లుకున్నాడు. ఇద్దరూ అదృశ్యులయారు. రోజల్లా వాళ్లు కొలను ఒడ్డున వుండి పోయి, మర్నాడు తిరిగి మాళవరాజ్యానికి బయలుదేరారు.

వారం రోజులకల్లా ఉదయనుడూ, చిత్రకారుడూ రాజమహలు చేరారు. చిత్రకారుడు తాను తయారు చేసిన చిత్రాలన్నిటినీ వరసగా పేర్చాడు. ఒక్కొక్క బొమ్మనూ పరిశీలిస్తూ, ఆ వెంటనే ఉదయనుడి వైపు చూస్తూ వస్తున్నాడు. మధ్యలో ఒక బొమ్మ వద్దకు వచ్చేసరికి చిత్రకారుడు, ఉదయనుడి వైపుకు చూసి, ఆ బొమ్మ ఉదయనుడి పక్కనే పెట్టి మళ్ళీ చూసి, "భేష్! ఇది మీకు సరిపోయింది. ఈ వేషం వేస్తే మిమ్మల్ని ఆ రాక్షసుడిభటులు కాదుగదా, ఎవరూ పోల్చుకోలేరు," అన్నాడు.

"అవును," అన్నాడు ఉదయనుడు ఆ బొమ్మకేసిచూస్తూ సంతోషంతో నిండిన హృదయంతో.

ఆ వెంటనే ఉదయనుడికి రాక్షసుల అనుచరులలో ఒకనిలాగా వేషం వేశాడు చిత్రకారుడు. ఒకటికి రెండుసార్లు ఉదయనుడు తన రూపాన్ని అద్దంలో చూసుకున్నాడు. "అహాఁ చాలా బాగా కుదిరింది!" అనుకుని, మర్నాడే రాజు వద్ద సెలవు తీసుకుని, తిరుగా కొలనుకు బయలుదేరాడు.

ఉదయనుడు కొలనుకు చేరుకుంటూనే తన వద్దవున్న భస్మం కోసమని, ఎప్పటిలాగా అలవాటు ప్రకారం దుస్తులు

తడివి చూసుకున్నాడు. కాని, భస్మం కనిపించలేదు. గత్యంతరం ఏమిటా అని కొంతసేపు ఆలోచించి, ధైర్యం తెచ్చుకుని, చీకటిపడే వరకూ ఎవళ్ళ కంటా పడకుండా, ఒక పొద చాటున దాక్కున్నాడు.

చీకటి పడింది. రాక్షసుడి పరివారంలో మరికొందరు, కొలను దగ్గరకు వచ్చి, అంతకు ముందు అక్కడ కాపలా కాస్తున్న జట్టును విడుదల చేశారు. విడుదలైన వాళ్ళు పాతాళగృహం చేరుకొని, ఒక్కొక్కరే లోపలికి ప్రవేశించారు. చిట్టచివరి వాడు అందులో ప్రవేశించబోయే సమయంలో, ఉదయనుడు కూడా యుక్తిగా అతని వెంట లోపలికి వెళ్ళాడు.

తన మాయ వేషం ఎక్కడ తెలిసిపోతుందో అని ఉదయనుడు లోలోపల జంకుతూనే వున్నాడు. అయితే దైవవశాత్తు ఇంతవరకు అలాటిదేమీ జరగలేదు. కారణం ఏమిటంటే—ఉదయనుడి వేషం చూసి, అతడు తమలోవాడే అనుకున్నారు తక్కినవాళ్ళు.

ఈ సారి ఉదయనుడు మెట్లన్నీ దిగి, ఆ సింహాల పక్కగానే పోయాడు. జట్టులో కలిసిపోయి వుండటం వల్ల, ప్రత్యేకించి అవి తనను పసికట్టలేవని ఉదయనుడి ధైర్యం. అయితే అవి కొత్తమనిషిని యిట్టే పసికట్టినై. వెంటనే అతడి పైనబడి చంపబోయాయి. కెవ్వన కేకవేసి ఉదయనుడు పడిపోయాడు.



ఈ దృశ్యం చూసి మిగతావాళ్ళంతా పరుగెత్తుకుంటూ వచ్చి, ఒక్క వేటుతో సింహాలు రెండింటినీ నరికివేశారు. తరవాత ఉదయనుణ్ణి వెంటదీసుకు వెళ్ళి చుట్టూ గుమిగూడారు. "మననే చంపబోయి నయ్యే, యీ సింహాలు! ఎంత పొగరు. వాటికి మంచి శాస్తి చేశావులే!" అని సింహాలను చంపినవాడిని అందరూ మెచ్చుకున్నారు.

తరవాత వాళ్ళు ఉదయనుడికి పరిచర్య చేశారు. గాయాలకు కట్లు కట్టారు. కాస్తంత తేరుకున్న వెనక, "తమ్ముడూ! నీ గాయాలు పూర్తిగా మానిపోయేవరకు రెండు రోజులపాటు యిక్కడే వుండు. అంతవరకు కాపలా పని మేము చూచుకుంటాంలే," అన్నారు.

"అయితే మరొక్క ఉపకారం చేసి పొండి. నేను కాలు కదపలేకుండా వున్నాను. కనుక నా తిండి ఏర్పాటు కూడా చేసిపొండి. మీకు పుణ్యం వుంటుంది," అన్నాడు ఉదయనుడు.

అందుకు సరే అని, కాపలావాళ్ళు ఉదయనుడికి మాంసమూ, పానీయాలూ తెచ్చి యిచ్చారు. తరవాత తిండికీ, పడకకూ సదుపాయం చేసి, ఎవరిదారిన వాళ్ళు వెళ్ళిపోయారు.

తెల్లవారింది. రాక్షసుడి పరిచారకులు కొలనుకు బయలుదేరి వెళ్ళి, అక్కడి కాపలావాళ్ళను విడుదల చేశారు. మరి కొద్దిసేపటికల్లా వాళ్ళు, ఉదయనుడి దగ్గిరకొచ్చి, "అదృష్టవంతుడివిరా, తమ్ముడూ!" అని ఆనందించారు. రాత్రల్లా కాపలా కాసి వుండటాన వాళ్ళు మరి కొంచెం సేపటిలోనే గుర్రుపెడుతూ నిద్ర పోసాగారు.

సరీగా అర్థరాత్రి వేళ రాక్షసుడు వచ్చేశాడు. వస్తూనే మెట్ల కింద సింహాలు రెండూ చచ్చిపడి వుండటం చూచాడు. వాడికి పట్టరానంత కోపం వచ్చింది. "ఎవడిదిరా, ఈ పని?" అని బొబ్బలు పెడుతూ ఉదయనుడు పడుకొనివున్న చోటుకు వచ్చాడు. —(ఇంకావుంది)






# సౌందర్య పిపాస

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజానవేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, ఇంతశ్రమపడి నువు తీరా విజయం సాధించిన తరవాత, వెనకటికి చంద్రకుడి లాగా విజయాన్ని చేజేతులా పోగొట్టుకోకుండా చూసుకో. నీకు శ్రమతెలియకుండా ఉండగలందులకు చంద్రకుడి కథ చెబుతాను, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం సత్రాజిత్తు అనే యక్షరాజు ఒకడు ఉండేవాడు. అతనికి తేజోవతి అనే కుమార్తె ఉండేది. తేజోవతి గొప్ప సౌందర్యవతి. సత్రాజిత్తును ఇద్దరు యక్షకుమారులు అనుక్షణమూ సేవిసూ ఉండే వాళ్ళు. వారిలో ఒకడు రుద్రకుడు, రెండోవాడు చంద్రకుడు.

## బేతాళ కథలు



రుద్రకుడంటే సత్రాజిత్తుకు ప్రత్యేకమైన అభిమానం ఉండేది. అయితే రుద్రకుడు సత్రాజిత్తును శ్రద్ధగా సేవించటానికి కారణం తేజోవతి. రుద్రకుడు ఆమెను అమితంగా ప్రేమించాడు. కాని రుద్రకుడు అందగాడుకాడు, అంతగా పరాక్రమశాలి కూడా కాడు. ఆ రెండు గుణాలూ చంద్రకుడిలో ఉండేవి. సౌందర్యమంటే వ్యామోహంగల తేజోవతి చంద్రకుడి పైన కన్నువేసి ఉంచింది. చంద్రకుడు మాత్రం సత్రాజిత్తు మీద భక్తి గౌరవాలు ఉండటంచేతనే అతన్ని సేవిస్తూ వచ్చాడు. అతనికి తేజోవతి మనస్తత్వం తెలుసును. అందుచేత రుద్రకుడికి తేజోవతి దొరకదని చంద్రకుడు జాలిపడేవాడు.

సత్రాజిత్తు తన కుమార్తె వివాహం గురించి ఆలోచిస్తున్నట్టు తెలియగానే రుద్రకుడు తాను తేజోవతిని పెళ్ళాడటానికి సిద్ధంగా ఉన్నట్టు చెప్పాడు. సత్రాజిత్తు ఈ మాటకు సంతోషించి, రుద్రకుణ్ణి పెళ్ళాడమని తేజోవతికి సలహా ఇచ్చాడు.

అందంలేని రుద్రకుణ్ణి పెళ్ళాడటం ఎంతమాత్రమూ ఇష్టంలేక తేజోవతి, "నన్ను పెళ్ళాడగోరే వాడికి ఒక పరీక్ష పెడతాను. అందులో నెగ్గినవాణ్ణే నేను పెళ్ళాడతాను," అన్నది తండ్రితో.

"ఏమిటా పరీక్ష?" అని సత్రాజిత్తు అడిగాడు.

"గంధర్వవనంలో ఒక సరస్సు ఉన్నది. అందులో సువర్ణకమలాలున్నాయి. వాటి రసాన్ని పూసుకున్నవాళ్లు సమస్త వ్యాధుల నుంచీ విముక్తి పొందటమేగాక, గంధర్వులతో సమమైన అందాన్ని కూడా పొందుతారు. గంధర్వులను జయించి, సువర్ణకమలాన్ని తెచ్చినవాణ్ణే నేను పెళ్ళాడతాను," అన్నది తేజోవతి.

సత్రాజిత్తు తన భృత్యుల నిద్దరినీ పరీక్షలో పాల్గొనమన్నాడు. ఇద్దరూ గంధర్వవనానికి బయలుదేరారు. ధైర్యసాహసాలు

గల చంద్రకుడు దారిప్రమాదాలను లక్ష్య పెట్టక, అడ్డదార్ల వెంబడి శీఘ్రంగా గంధర్వవనం చేరి, అక్కడి సరస్సులో సువర్ణకమలాలను చూసి, ఒకటి తీసు కోవటానికి నీటిలోకి దిగాడు.

మరుక్షణమే అతన్ని ఎవరో వెనక్కు గుంజినట్టయింది. అదృశ్యంగా అక్కడ ఉన్న గంధర్వుడు ఒకడు సింహంరూపం ధరించి, పెద్దగా గర్జిస్తూ చంద్రకుడి మీదికి వచ్చాడు. అది నిజమైన సింహం కాదని తెలిసిన చంద్రకుడు ఆ సింహం కంఠాన్ని రెండు చేతులాపట్టుకుని, గట్టిగా నొక్కాడు. ఊపిరాడక, గంధర్వుడు గిల గిలా తన్నుకుని, అసలు రూపంతో, తనను చంప వద్దని చంద్రకుణ్ణి వేడుకున్నాడు.

చంద్రకుడు తానువచ్చినపని చెప్పాడు. గంధర్వుడు సరస్సు నుంచి ఒక సువర్ణ కమలం కోసి ఇచ్చాడు. చంద్రకుడు ఆ కమలాన్ని తీసుకుని, అప్పటికే చీకటి పడటంచేత, సమీపంలో ఉన్న ఒక గుహలో ఆ రాత్రికి ఉండిపోయాడు.

ఒక రాత్రివేళ చంద్రకుడికి సింహ గర్జన వినిపించింది. అతను వేగంగా సరస్సు దగ్గిరికి వెళ్ళేసరికి, అక్కడ రుద్రకుడు తీవ్రంగా గాయపడి, మూలు గుతూపడి ఉండటం కనిపించింది. అతనికి స్పృహలేనట్టు చంద్రకుడికి తోచింది.



వెంటనే చంద్రకుడు రుద్రకుణ్ణి తాను ఉన్న గుహకు తెచ్చి, తన వద్ద ఉన్న సువర్ణకమలాన్ని పిండి, దాని రసం రుద్రకుడి శరీరమంతా పూశాడు. వెంటనే రుద్రకుడికి గంధర్వుల సౌందర్యం వచ్చే సింది. చంద్రకుడు తనకు చేసిన సహా యానికి రుద్రకుడు కృతజ్ఞత తెలుపు కున్నాడు.

ఇద్దరూ సువర్ణకమలం తీసుకు రాకుం డానే తిరిగి వచ్చారు. అయినా, తన తండ్రి కోరిన ప్రకారం తేజోవతి రుద్రకుణ్ణే పెళ్ళాడింది.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, సౌందర్య పిపాస గల తేజోవతి చివరకు

రుద్రకుణ్ణి పెళ్ళాడటంలో వింత లేదు. కాని చంద్రకుడు తాను సాధించిన విజయాన్ని రుద్రకుడికి ఎందుకు ధార పోశాడు? ఇద్దరూ తేజోవతి పెట్టిన పరీక్షలో పాల్గొన్నవాళ్ళేగదా? అసలు తేజోవతి చంద్రకుణ్ణి చేసుకుంటానని తండ్రికి చెప్పక, పోటీ పరీక్ష ఎందుకు పెట్టింది? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''సత్రాజిత్తును తేజోవతి కోసం అడిగినవాడు రుద్రకుడే గాని, చంద్రకుడు కాడు. వాళ్ళిద్దరిలో ఎవరినో ఒకరిని చేసుకోమని తండ్రి అడిగి ఉంటే తేజోవతి చంద్రకుణ్ణి ఎన్నుకుని వుండేది. కాని తనను పెళ్ళి చేసుకుంటానని అడగని వాణ్ణి తాను చేసుకుంటానని తేజోవతి ఎలా అనగలదు? అందుకే ఆమె పోటీ పెట్టి, చంద్రకుణ్ణి కూడా తన స్వయంవరంలో ఇరికించింది. ఈ పోటీలో చంద్రకుడు తప్పక నెగ్గుతాడనీ, రుద్రకుడు తప్పక ఓడుతాడనీ ఆమెకు తెలుసు. సువర్ణకమలంతో చంద్రకుణ్ణి మరింత అందంగా తయారుచేసి తన భర్తను చేసుకుందామని తేజోవతి ఎత్తువేసింది. కాని ఆ ఎత్తు పారకపోవటానికి కారణం చంద్రకుడే. సత్రాజిత్తు ఆజ్ఞను పాటించి అతను పోటీలోకి దిగాడుగాని, తేజోవతి కోసం కాదు. అతనికి రుద్రకుడి పైన ఎలాటి అసూయా లేదు, పైపెచ్చు అతని పట్ల ఎంతో స్నేహభావం వున్నది. అతను తేజోవతిని ఎంతగా ప్రేమిస్తున్నాడో కూడా చంద్రకుడికి తెలుసు. అతను ఆ రాత్రి తిరుగు ప్రయాణం కాకుండా ఆగినది కూడా రుద్రకుడిఅదృష్టం ఎలా వుంటుందో చూడడానికేనేమో! అందుచేత చంద్రకుడు తాను సాధించిన విజయాన్ని జారవిడవటం జరగలేదు; అతను దాన్ని సద్వినియోగం చేశాడు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# అసూయ

పూర్వం రామాపురం అనే గ్రామంలో బొమ్మలు చెయ్యటంలో ప్రసిద్ధికెక్కిన శిల్పి ఒకడు ఉండేవాడు. రామదత్తుడూ, సోమదత్తుడూ అని అతనికి ఇద్దరు కొడుకులు ఉండేవాళ్ళు. వీరిద్దరూ పెద్దవాళ్ళయినాకనే తండ్రి పోయాడు. అప్పటికి రామదత్తుడు బొమ్మలు చెయ్యటంలో తండ్రి అంతటివాడయాడు. తండ్రి నడిపిన బొమ్మల దుకాణాన్ని రామదత్తుడే విజయవంతంగా నడపసాగాడు.

రెండోవాడైన సోమదత్తుడు బొమ్మలు చెయ్యటం నేర్చుకోలేదు. చదువు మీద ఆసక్తి ఉండి చదువుకున్నాడు. పదహారేళ్ళు వచ్చేసరికి అతను తమ గ్రామంలో ఉండే గురువుల వద్ద విద్యాభ్యాసం పూర్తి చేశాడు. పెద్ద చదువులు చదవటానికి అతన్ని అన్న మధురానగరం వద్ద ఉండే జగన్నాథపండితుడి వద్దకు పంపాడు.

జగన్నాథపండితుడి వద్ద చాలామంది శిష్యులుండేవారు. అయినా సోమదత్తుడు ఆయన శిష్యులలో చాలా తెలివిగలవాడన్న పేరు తెచ్చుకున్నాడు. దానితో సోమదత్తుడిలో గర్వమూ, అహంకారమూ పెరిగాయి.

ఇంతలో జగన్నాథపండితుడి వద్దకు ఆనందుడనే మరొక శిష్యుడు వచ్చి చేరాడు. ఈ ఆనందుడు అపారమైన తెలివితేటలూ, ప్రజ్ఞా, ప్రశాంతతా, చక్కని ప్రవర్తనాకలవాడు. అతడి తెలివితేటలకు అందరూ ఆశ్చర్యపడి, అతన్ని ఎంతో ఆదరంతోనూ, గౌరవంతోనూ చూడసాగారు.

ఆనందుడు అన్నివిధాలా తన కన్న తెలివిగలవాడు కావటంచూసి సోమదత్తుడికి అసూయ కలిగింది. అది క్రమంగా క్రోధంగా మారింది. అయితే సోమదత్తుడు

గంగిశెట్టి శివకుమార్



ఈ విషయాన్ని తనలోనే దాచుకుని పైకి ఏమాత్రమూ కనబడనియ్యలేదు.

ఒకనాడు జగన్నాథపండితుడి శిష్యులందరూ సమిధలు మొదలైనవాటి కోసం అరణ్యానికి వెళ్ళారు. సోమదత్తుడు ఆనందుడి భుజంమీద చెయ్యివేసి, ఆప్యాయంగా మాట్లాడుతూ, మిగిలిన శిష్యుల నుంచి వేరుచేసి, ఒక నిర్జన ప్రాంతానికి తీసుకు వెళ్ళాడు. అతను ఆనందుణ్ణి కాలిమీదతన్ని వెల్లికిలాపడేసి, దగ్గిరలో ఉన్న ఒక పెద్ద రాయిఎత్తి, "ఈ రోజుతో నాకు నీ పీడ వదులుతుంది," అంటూ అరిచి, ఆనందుడి తల పగలగొట్టబోయాడు.

ఇంతలో "ఆగు! ఆగు! ఏమిటది?" అంటూ కొందరు శిష్యులు అటుగావస్తూ కేకలు పెట్టారు.

సోమదత్తుడు రాయి అవతల పారేసి, కాలి సత్తువకొద్దీ పారిపోయాడు.

దిగాలుపడి ఇంటికి వచ్చిన తమ్ముణ్ణి చూసి రామదత్తుడు, "ఎందుకురా అలా ఉన్నావు? నీ చదువు అయిపోయిందా?" అని ఆత్రంగా అడిగాడు.

సోమదత్తుడు తన అన్నకు జరిగినదంతా దాచకుండా చెప్పి బావురుమన్నాడు. అంతా విని రామదత్తుడు తమ్ముణ్ణి ఓదార్చాడు.

కొద్దికాలం గడిచింది. ఎక్కడినుంచో మరొక బొమ్మలు చేసేవాడు రామాపురం వచ్చి, రామదత్తుడి దుకాణానికి ఎదురుగా మరొక బొమ్మల దుకాణం పెట్టాడు. కొత్తవింతా, పాతరోతా అన్నట్టు, అందరూ ఆ దుకాణంలో బొమ్మలు కొనసాగారు. సోమదత్తుడు ఇది చూసి, నిలకడమీద నిజం బయటపడుతుంది లెమ్మనుకున్నాడు.

కాని తన అన్న చేసే బొమ్మలు బాగుండటంలేదని కొందరు అనుకోవటం సోమదత్తుడు విన్నాడు. కొత్తవాడు బొమ్మలు చెయ్యటంలో నేర్పరి అయితే కావచ్చుగాని, తన అన్న చేసే బొమ్మలు

బాగా ఉండకపోవటం అసాధ్యమని అత నికి అనిపించింది.

ఒకనాడు సోమదత్తుడు తన అన్న దుకాణానికి బయలుదేరాడు. దారిలో అతనికి, బొమ్మలు కొని వాటిని చూసి మురిసిపోతూ వచ్చే మనిషి ఒకడు కని పించాడు. "వాటిని ఎక్కడ కొన్నావు?" అని సోమదత్తుడు ఆ మనిషిని అడిగాడు.

"కొత్తవాడి దగ్గిర కొన్నాను," అన్నాడు ఆ మనిషి.

సోమదత్తుడు ఆ బొమ్మలు తీసుకుని చూస్తే, అవి తన అన్న చేసే బొమ్మలలాగే ఉన్నాయి. జనం ఆ కొత్తవాడి బొమ్మల కోసం ఎందుకు ఎగబడుతున్నారో అతనికి అర్థంకాలేదు.

అతను దుకాణంచేరేసరికి రామదత్తుడు ఒక బొమ్మను చేస్తున్నాడు. అతని చేతులు పనిచేస్తున్నాయేగాని, అతని కళ్ళు ఎదురు దుకాణంలో బొమ్మలు కొంటున్న వాళ్ళ మీదే ఉన్నాయి. అతని మనసు చేసేపని మీద ఉన్నట్టులేదు. అతని పక్కనే తయారయిన బొమ్మలు కొన్ని ఉన్నాయి. వాటి చేతగాని, రంగులుగాని ఎంత మాత్రమూ బాగా లేవు. సోమదత్తుడికి రామదత్తుడి పరిస్థితి అర్థమయింది.

రామదత్తుడు తలఎత్తి సోమదత్తుడి కేసిచూసి, "ఏరా, మన దుకాణానికి ఎవరూ రావటంలేదని దిగులుపడు తున్నావా? ఇలా ఎంతో కాలం సాగదులే! గ్రామాధికారికి తృణమో, పణమో ముట్ట



జెప్పి వాణ్ణి ఊళ్ళోనుంచి వెళ్ళగొట్టిస్తాను. ఆ తరవాత జనం చచ్చినట్టు మన దగ్గిరే బొమ్మలు కొంటారు,'' అన్నాడు ఆవేశంగా.

కొత్తవాడి పోటీ మూలంగా తన అన్న మనసు చెడిపోయిందనీ, అందుకే బొమ్మలు సరిగ్గా చేయలేకపోతున్నాడనీ సోమదత్తుడు గ్రహించాడు. మరుక్షణమే అతనికి తన చెంప మీద ఎవరో కొట్టి నట్టయింది. వెంటనే అతను ఇంటికి తిరిగివెళ్ళి, ఆ రోజే మధురానగరానికి బయలుదేరి వెళ్ళాడు.

అతను జగన్నాథపండితుడి కాళ్ళ మీదపడి, క్షమాపణ చెప్పుకుని, ఆనందు డికి కూడా క్షమాపణ చెప్పుకుని, తన చదువు కొనసాగించాడు. ఆనందుడు అతని మీద ఏ కక్షా పెట్టుకోలేదు. ఇద్దరూ ఆప్తమిత్రులయారు. చివరకు సోమ దత్తుడు విద్య పూర్తి చేసుకుని, సమగ్ర పండితుడై, తన ఊరికి తిరిగి వచ్చాడు.

తన తమ్ముడు పండితుడై తిరిగివచ్చి నందుకు రామదత్తుడు సంతోషించి, ''చదువు మాని వచ్చినవాడివి ఎందుకు తిరిగి వెళ్ళావు ?'' అని అడిగాడు.

దానికి సోమదత్తుడు ఇలా అన్నాడు:

''నేను ఒక జీవిత సత్యం నేర్చు కున్నాను. మనని మించినవాణ్ణి చూడ గానే అసూయ కలగటం సహజం. ఆ అసూయ పట్టుదలగా మారితే మనం పైకి రాగలుగుతాం. అది క్రోధంగా మారితే అవతలి వాడి నాశనం కోరి మనం కూడా నాశనమవుతాం. నేను ఆనందుణ్ణి చూసి అసూయపడ్డాను. నేను చేసిన పొరపాటే మిటో నీ ద్వారా తెలుసుకున్నాను. నీ పోటీ దారు చేసిన బొమ్మలు అంత గొప్పవేమీ కావు. నువు తలుచుకుంటే అంతకన్న బాగా చెయ్యగలవు.''

రామదత్తుడు నవ్వి, ''నిజమే. నీకు ఆ సంగతి తెలియటం కోసమే నేను ఒక నాటకం ఆడాను. ఆ పోటీదారు పొరు గూళ్ళో ఉండే నా స్నేహితుడే. వాడు అమ్మినవి నా బొమ్మలే. ఈ నాటకం నీకు లాభించింది,'' అన్నాడు.



# 165. ప్రాచీన రోమన్ నగరాలు

క్రీస్తుశకం 79 లో వెసూవియస్ అనే అగ్నిపర్వతం పేలిన ఫలితంగా పాంపే, హెర్క్యులేనియమ్ అనే రెండు నగరాలు పూర్తిగా మట్టి కింద కప్పబడిపోయాయి. వీటి దుస్థితి గురించి అప్పటి వారికి తెలిసినప్పటికీ, 18 వ శతాబ్ది దాకా ఆ నగరాల జాడ ఎవరికీ తెలియదు. 1710 లో హెర్క్యులేనియమ్ తాలూకు తొలి జాడలు, బావి కోసం తవ్వుతూండిన ఒక రైతుకు గోచరించాయి. కాలక్రమాన తవ్వకాలలో రెండు నగరాలూ పూర్తిగా బయటపడ్డాయి. చిత్రమేమిటంటే ఈ నగరాలూ, వాటిలోని శిల్పాలూ చెక్కుచెదరలేదు.

హెర్క్యులేనియమ్‌లో మొట్టమొదట బయటపడిన భవంతి జూలియస్ సీజర్ మామగారిది. అది చాలా ప్రశస్తమైనది. పైన ఉన్న బొమ్మలో కనిపించేది పాంపేనగరం లోని జూపిటర్ దేవాలయం. వెనుక భాగంలో ఆవిర్లు చిమ్మే వెసూవియస్ పర్వతాన్ని చూడవచ్చు.





# గండం తప్పిన అజితుడు

"నువు కాళీమాత ముద్దుబిడ్డ అయిన రఘుతోనే యుద్ధం చేస్తావుగా?'' అంటూ బందిపోటు రఘు కత్తి అడ్డంగా తిప్పి, అజితుడు అనే గ్రామీణ యువకుడి వీపు మీద కొడుతూ ఇకిలించాడు.

చేతులూ, కాళ్ళూ అడవి తీగలతో కట్టి ఉన్న అజితుడు ఏమీ జవాబు చెప్పక, మౌనంగా ఉండిపోయాడు.

''ఈ పొగరుమోతువాడి తల ఒక్క కత్తి వేటుతో తెగవెయ్యమంటావా, అన్నా?'' అని రఘు అనుచరుడు ఒకడు ఉత్సాహంతో కేకపెట్టాడు.

''వద్దు, వద్దు. పొరపాటున కూడా అలాటి పని చెయ్యకు. వచ్చే అమావాస్య శనివారం పర్వదినాన ఇతణ్ణి తనకు బలి ఇయ్యగలందులకు కాళీమాతే పంపింది. ఇతడు బ్రాహ్మణుడు కూడానూ. యజ్ఞోపవీతం ఉన్నది. ఇటువంటి వాణ్ణి బలి ఇస్తే కాళీమాత ఎంతో సంతోషిస్తుంది." అని పేరుమోసిన బందిపోటు రఘు అక్కడి నుంచి వెళ్ళిపోయాడు. అజితుణ్ణి ఒక కుటీరంలో బంధించి, విచ్చుకత్తులవాళ్లు కాపలా ఉన్నారు.

గ్రామీణ యువకుడైన అజితుడు మరి కొందరు యాత్రికులతో పూరీకి బయలు దేరాడు. ఆ రోజుల్లో రైళ్ళులేని కారణం చేత యాత్రికులు జట్లుగా యాత్రలు చేసేవారు. దారులు చాలా ప్రమాదకరంగా ఉండేవి. అరణ్యాల కుండా ప్రయాణించవలసి వచ్చేది. అక్కడ క్రూరమృగాలు ఉండేవి; ఒక్క పైసాకోసం మనిషి ప్రాణాలు నిలువునా తీసే క్రూరులైన దొంగలు ఉండేవారు.

అజితుడున్న యాత్రికులముఠా చాలా దూరం క్షేమంగానే ప్రయాణం సాగించింది. కాని వాళ్ళు పూరీకి ఇంకా మూడు

పి. సి. సర్కార్, ఇంద్రజాలికుడు

రోజులలో చేరుతారనగా, అపరాహ్ణంవేళ పేరుమోసిన గజదొంగ రఘు, అతని అనుచరులూ అరణ్యమార్గంలో యాత్రికులమీద పడ్డారు.

అజితుడు కర్రసాములో గట్టివాడు. అతను తన కర్రతో దొంగలను ఎదిరించి నిలబడ్డాడు. అతను కర్ర తిప్పుతూ, కత్తులూ, బల్లాలూ గల అరుగురు దొంగలను అటకాయించాడు. అతను దొంగలను అడ్డుకోవటంతో అతని వెంట ఉన్న యాత్రికులందరూ తప్పించుకు పోయి అపాయంలేని చోట్లు చేరుకున్నారు.

ఒంటరిగా ఒక గంటకుపైగా పోరాడిన మీదట అజితుడు క్రమంగా నీరసించి, పడిపోయి, దొంగలకు చిక్కిపోయాడు. వాళ్ళు అతన్ని పట్టుకుని తమ నాయకుడైన రఘు వద్దకు తీసుకుపోయారు.

తన గతి ఏమి కానున్నదీ మొదట అజితుడికి అంతుబట్టలేదు. కాని రఘు అన్నమాటలతో అతనికి తన చావు రూఢి అని తెలిసిపోయింది. తనను దొంగలు కాళికి బలి ఇస్తారు. కాళి దొంగల దేవత. అయినా, తన అనుచరులు తప్పించుకుపోగలిగారుగదా అని అతను సంతోషించాడు.

అతను నిద్రపోదామనుకున్నా, నిద్ర పట్టలేదు. ఆరాటంతో అతను అర్ధరాత్రి వేళ మేలుకుని, తప్పించుకుపోయే




మార్గం ఉందేమోనని చూశాడు. కుటీరంలో ఒక కిటికీ ఉన్నది. దానికి ఇనుప కమ్ములు ఉన్నాయి. అతను ఆ కమ్ములను కదిలించలేక పోయాడు. కిటికీలో నుంచి చూస్తే, గుడ్డి వెన్నెలలో కుటీరం నాలుగు మూలలా నలుగురు మనుషులు కాపలా కాస్తున్నారు. తను చావు తప్పించుకునే మార్గం లేదు.

తెల్లవారింది. అజితుడిలో కొత్త ఆశ తల ఎత్తింది. కిటికీ కుండా చూస్తే పక్షులు కలకలం చేస్తున్నాయి. కిటికీని ఆనుకుని దొంగల పూలతోట ఉన్నది. అందులో రక్తవర్ణంగల జపాపుష్పాలు కనిపించాయి. ఎడమపక్కగా ఒక నిమ్మచెట్టున్నది.



దానినిండా పండిన నిమ్మకాయలున్నాయి. దానికొమ్మ ఒకటి కిటికీకి రాచుకుంటున్నది.

తన యుక్తి పారితే ప్రాణాలతో బయట పడవచ్చునని అజితుడు అనుకున్నాడు. అతనికి స్వల్పంగా ఇంద్రజాలం తెలిసి ఉండటంతో ఉత్సాహం వచ్చింది. అజితుడి మేనమామకు ఇంద్రజాలం బాగా తెలుసును. ఆయన మూలికలతోనూ, రసాయనాలతోనూ చాలా అద్భుతాలు చేసేవాడు. ఆయనతో చాలా కాలంగా సాంగత్యం ఉండటంచేత అజితుడికి కొన్ని విద్యలు పట్టుబడ్డాయి.

అజితుడు నిస్పృహను దూరంగా తరిమేశాడు. బతకాలన్న ప్రేరణ అతనిలో బలంగా కలిగింది. అందుకుగాను అతను పథకం వేశాడు.

శనివారం దగ్గిరపడుతున్నది. దొంగలు తమ దేవతను అర్చించే సన్నాహాలు చేసుకుంటున్నారు.

శనివారం ఉదయం రఘు అజితుణ్ణి చూడవచ్చాడు.

''అబ్బాయీ, నీ ధైర్యం మెచ్చుకో దగినది. నీ కర్రసాము అమోఘం. అందులో నీకెవరూ సాటిరారు. బతికుంటే నువు మాకు ఎంతో ఉపయోగపడేవాడివి. కాని నువు చావక తప్పదు. అది మా కాళీ మాత అజ్ఞ. ఆమెకు నీ రక్తం కావాలట. నిన్ను పంగకర్ర బోనులో పెట్టి, ఈ రాత్రికి కాళీమాత ముందు నీ తల నరికేస్తాం. కాళీమాతే బలికోసం నిన్ను, మీ గ్రామం నుంచి ఈ అరణ్యానికి రప్పించింది. నువు చావాలన్నది ఆమె నిర్ణయం,'' అన్నాడు రఘు.

అజితుడు ఉద్రేకంగా, ''అది అబద్ధం! రఘూ, నీకు తెలియదేమో, నేను గొప్ప కాళీమాత భక్తుణ్ణి. ఆమె నన్ను ఇక్కడికి రప్పించినది చావటానికి కాదు, నీలో ఉన్న క్రూరపశువును నిర్మూలించటానికి. ఆ పశువే నిన్ను ఇంత క్రూరంగానూ, దొంగగానూ చేసింది. నా కళ్ళలోకి చూడు ఏం కనబడుతుందో!'' అన్నాడు.

రఘు, "హా, హా, హా, హా!" అంటూ నవ్వి, "నువు మహా పేలుతున్నావు. ఈ క్షణమే నీ నాలుక నరికేసి ఉందును. కాని అప్పుడు నువు వికలాంగుడివై, అమ్మ వారి బలికి పనికిరావు," అన్నాడు.

"రఘూ, నేను చేసేది పేలాపనకాదు. నువు జాగ్రత్తపడటానికి ఇంకా వ్యవధి ఉన్నది. ఈ క్రూరత్వం విడిచిపెట్టు. ఇతరులను దోచుకోకు. పాపమార్గం వది లెయ్యి. మళ్ళీ చెబుతున్నాను. కాళీమాత కలలో కనిపించి, నేను ఆమె భక్తుణ్ణి గనక, నిన్ను బాగుచెయ్యమని చెప్పింది. నిన్ను గురించీ, నువు చేసే దారుణమైన బలులను గురించీ ఆమె ఎంతమాత్రమూ తృప్తిపడటంలేదు," అన్నాడు అజితుడు.

"నువు కాళీమాత భక్తుడివని రుజువు చేస్తావా?" అని రఘు అడిగాడు.

"తప్పక చేస్తాను," అన్నాడు అజితుడు.

"ఎలా?" అని రఘు అడిగాడు.

"ఏదైనా సామాన్య వస్తువు కావాలి," అంటూ అజితుడు కుటీరం అంతా కలయ జూసి, ఒకమూల నలిపిపడేసి ఉన్న ఒక తెల్లకాగితం ఏరాడు. అతను ఆ కాగితాన్ని రెండుగా చించి, ఒకటి తాను ఉంచుకుని, రెండోది రఘుకు ఇచ్చి, "చూడు, రఘూ. నన్ను మీ దేవాలయానికి తీసుకుపో. అదే సరి అయినచోటు," అన్నాడు.



అజితుడి చేతులను తీగలతో మళ్ళీ బంధించి, అతన్ని కాళీ ఆలయానికి తీసుకుపోయారు. అతని వెంట ఆయుధాలుగల బందిపోటు దొంగలు కాపలా వచ్చారు.

అజితుడు మహాకాళి ముందు సాష్టాంగ పడి ప్రార్థనచేశాడు.

తరవాత అతను, "రఘూ, దేవిపాదాల దగ్గిర ఉన్న జపాపుష్పం ఒకటి తీసి, దాన్ని రెండు భాగాలు చేసి, ఒక భాగం నువ్వు ఉంచుకుని, రెండోది నాకు ఇయ్యి. నేను నీ కిచ్చిన కాగితం ముక్క కింద ఉంచు. దాన్ని పుష్పంతో రుద్దు. నేను నిజంగా మహాకాళి భక్తుణ్ణే అయితే, నా కాగితం

మీద ఎర్రని మరకలూ, నీ కాగితం మీద నీలం మరకలూ వస్తాయి. జై మహాకాళీ! ఇక ఉపక్రమించుదాం," అన్నాడు.

సరిగా అజితుడు అన్నట్టే, అతని కాగితం మీద ఎర్రమరకలూ, రఘు కాగితం మీద నీలం మరకలూ కనిపించే సరికి, రఘూతోబాటు అక్కడ ఉన్న ఇతర దొంగలు కూడా దిగ్భ్రమచెందారు.

"జై మహాకాళీ!" అని అజితుడు కేక పెట్టాడు.

దొంగలందరూ కూడా, "జై మహాకాళీ!" అన్నారు. వాళ్ళు అజితుడి కాళ్ళ మీద పడి, "స్వామీ, మమ్మల్ని రక్షించండి. మేం పాపులం! మమ్మల్ని కాపాడండి!" అన్నారు.

వాళ్ళు వెంటనే అజితుడి చేతి కట్లు విప్పేశారు. అతని సలహా పైన వాళ్ళు దొంగతనాలు మాని, తాము లోగడ దోచినదంతా బీద సాదలకు పంచిపెట్టి, అరణ్యంలో వ్యవసాయం చేసి జీవించ సాగారు.

జపాపుష్పాలనూ, నిమ్మకాయలనూ చూడగానే అజితుడికి తన మేనమామ తరచుగా చూపించిన ఇంద్రజాలం జ్ఞప్తికి వచ్చింది. అజితుడి వద్ద ఒక తెల్లకాగితం ఉన్నది. తన పూర్వీకుల పేర్లు రాసి, పూరీలో కర్మకాండ జరిపించే ఉద్దేశంతో అతను ఆ కాగితాన్ని దగ్గిర ఉంచుకున్నాడు. అతను ఆ కాగితాన్ని రెండుగా మడిచి, ఒక నిమ్మకాయ కోసి, దాని రసాన్ని సగం కాగితం మీద పూసి, అరబెట్టి, ఆ కాగితాన్ని నలిపి, కుటీరంలో ఒకమూల పారేశాడు. ఈ ఇంద్రజాలంలో ఉన్న చిత్రమేమిటంటే, జపాపుష్పం రేకులను మామూలు కాగితం మీద రుద్దితే నీలం, నలుపురంగుల మరకలు అవుతాయి, నిమ్మరసం పూసిన కాగితం మీద ఎర్రని మరకలు అవుతాయి.

ఒక మామూలు నిమ్మకాయ అజితుడి ప్రాణాలు నిలబెట్టటమే గాక, పేరు మోసిన గజదొంగలను బుద్ధిమంతులుగా మార్చింది.



# కవచపరీక్ష

ఒక సైనికుడి తండ్రి కవచాలు తయారుచేసేవాడు. అతను ఒకసారి ఒక మంచి కవచం తయారుచేసి, దాన్ని రాజుగారికి చూపాడు.

రాజు దాన్ని చూసి, "బాగానే ఉన్నది. కాని దీన్ని పరీక్షించాలి," అంటూ దాన్ని ఒక రాతి దిమ్మకు తొడిగి, కత్తులతోనూ, గదలతోనూ కొట్టించాడు. కవచం ముక్కలై పోయింది.

అది చూసి రాజు కవచం చేసినవాడితో, "దుర్మార్గుడా, నీ కవచాన్ని నమ్మి, దాన్ని ధరించి నేను యుద్ధానికిపోతే ఏమయేదో చూశావా ?" అని తిట్టి పంపాడు.

ఈ సంగతి తెలిసి అతని కొడుకైన సైనికుడు, తండ్రి చేత మరొక కవచం తయారు చేయించి, దాన్ని రాజు వద్దకు తీసుకుపోయాడు. రాజు దాన్ని మళ్ళీ రాతి బొమ్మకు తొడగ బోయాడు.

"మహారాజా, కవచపరీక్ష అదికాదు," అంటూ ఆ కవచాన్ని తాను ధరించి, రాజును పరీక్షించమన్నాడు. రాజు కత్తిదూసి వాడిపైకి వెళ్ళాడు. వెంటనే తానుకూడా కత్తిదూశాడు సైనికుడు.

అదిచూసి రాజు మండిపడ్డాడు. సైనికుడు ఆయనతో, "క్షమించండి, మహారాజా! కవచాలను రాతిదిమ్మలు ధరించవు. పోరాడేవాళ్ళు ధరిస్తారు. వారు ఆత్మరక్షణ చేసుకుంటారు," అన్నాడు.

అందులో నిజం గ్రహించి, రాజు మంచి వెలఇచ్చి కవచం కొన్నాడు. —సుదర్శన్.





# ఇద్దరు మిత్రులు

ఒక ఊళ్ళో రత్తయ్యా, రమణయ్యా అని ఇద్దరు మిత్రులు ఉండేవాళ్ళు. ఇద్దరికీ నా అనే వాళ్ళు ఎవరూ లేరు. ఇద్దరూ చిన్నతనం నుంచీ కలిసి కట్టుగా ఒకే కొంపలో ఉండేవారు. వాళ్ళకు ఒక పని అంటూ లేదు; బుద్ధి పుట్టినప్పుడు అడవికి వెళ్ళి, కట్టెలు కొట్టితెచ్చి అమ్మి, దానితో కాలక్షేపం చేసేవారు; బద్ధకం పుట్టినప్పుడు ఎవరి దొడ్డి నుంచి అయినా, ఏ అరటిగెలో దొంగిలించుకు పోయి, అమ్ముకునేవాళ్ళు.

రత్తయ్య అనే వాడి దగ్గిర వాడి తాతలనాటి సొట్టలుపడిన వెండి కంచం ఒకటి ఉన్నది.

రమణయ్య దగ్గిర ఒక పాతకాలపు నులకమంచం ఉన్నది. ఇద్దరూ ఆ వెండి కంచంలో తిని, ఆ నులక మంచం మీద పడుకునేవాళ్ళు.

ఒక వానాకాలం రాత్రి జోరున వర్షం కురుస్తూండగా మిత్రు లిద్దరూ వెండి కంచంలో భోజనం చేసి, మంచం మీద కూర్చున్నారు. రత్తయ్య వాటాలో కొంత అన్నం మిగిలిపోయింది. రమణయ్య వాటాలో కొద్దిగా కూర మిగిలింది. రేపు పొద్దున్న తినవచ్చు లెమ్మనుకుని, వాటి మీద ఆకు కప్పారు.

రత్తయ్య తమ దుస్థితికి చింతిస్తూ, "ఎంతకాలం మనం ఇలా జీవితం గడుపుతాం? రేపు మనం పెళ్ళిళ్ళు చేసుకుంటే పెళ్ళాలను ఎలా పోషిస్తాం?" అన్నాడు.

దానికి రమణయ్య, "ఇలాంటి వర్షపు రాత్రి ఏ మహానుభావుడో తలుపు తట్టి, రాత్రికి తలదాచుకుని, ఆశ్రయం ఇచ్చిన వారికి ఎంతో మేలుచేసి పోయినట్టుగా ఎన్నో కథలు విన్నాం. కాని ఏ కారణం

ఎం. కామేశ్వరరావు

వల్లనో తెలియదు. మన దరిద్ర కొంపకు మాత్రం ఏ మహానుభావుడూ రాడు,'' అన్నాడు విచారంగా.

''విచారించి ఏం లాభం? అర్ధరాత్రి కావస్తున్నది. పడుకుందాం,'' అన్నాడు రత్తయ్య.

ఇంతలో ఎవరో తలుపు తట్టారు. రత్తయ్య లేచి వెళ్ళి తలుపు తీశాడు. బయట కాషాయవస్త్రాలు ధరించిన ఒక ముసలివాడు చలికి వణుకుతూ అతడికి కనిపించాడు.

రత్తయ్య వాడితో కోపంగా, ''ఎవడి వయ్యా నువూ? ఇంత రాత్రివేళ మీ తాత కట్టించిన ఇల్లు అన్నట్టు తలుపు బాదావు!'' అన్నాడు.

''ముసలి సాధువును! ఆకలి దహించుకు పోతున్నది. ఈ పూట ఇక్కడ ఉండనియ్యండి,'' అన్నాడు సాధువు దీనంగా.

ఈ మాట వింటూనే రమణయ్య లేచి వచ్చి, ''రండి, స్వామీ. మీ రాకతో మా యిల్లు పావనమయింది. కాని ఈ పూట అన్నంలోకి కూర మాత్రమే ఉన్నది,'' అంటూ ముసలివాణ్ణి లోనికి ఆహ్వానించాడు.

సాధువు వాత్సల్యపూర్వకంగా నవ్వి, ''కాలే కడుపుకు మండే బూడిద చాలు, బిడ్డా! నీ మనసు దొడ్డది,'' అంటూ లోపలికి వచ్చి, రమణయ్య పెట్టిన అన్నమూ, కూరా తృప్తిగా తిన్నాడు.



తరవాత సాధువు రమణయ్యతో, "నా ప్రాణం నిలబెట్టావు, బిడ్డా. నీ వస్తువు ఏదైనా చూపించు, దానికి అద్భుతమైన శక్తినిచ్చి, నా దారిన నేను పోతాను,'' అన్నాడు.

'' ఈ నులకమంచం నాదే, స్వామీ," అన్నాడు రమణయ్య.

సాధువు తన చేతుల తడి మంచం మీద విదిలించి, '' ఫో, బిడ్డా ! ఇక నీకు బెంగలేదు. నువు ఈ నులక మంచం మీద పడుకుని, కాస్సేపు గట్టిగా కళ్ళు మూసుకున్నావంటే, ఎక్కడెక్కడి నిధి నిక్షేపాలూ నీ కళ్ళకు కట్టినట్టు కనిపిస్తాయి. సుఖపడు !'' అన్నాడు రమణయ్యతో.

ఈ మాటలు వినగానే రత్తయ్యకు రమణయ్య మీద ఎక్కడలేని అసూయా పుట్టుకు వచ్చింది. వెంటనే వాడు, '' అన్యాయం, స్వామీ ! మీరు తిన్నది నేను మిగిల్చిన అన్నం. వాడిది కూర మాత్రమే. అందుచేత మీరు అనుగ్రహించిన దాంట్లో మూడువంతులు నాకే రావాలి. అదీగాక, నులక మంచం నాది. వీడు దురాశతో అది తనది అంటున్నాడు," అని అబద్ధమాడాడు.

ఈ మాటకు రమణయ్యకు మండిపోయింది. ఇద్దరూ ఆ మంచం తనదంటే తనదని రెట్టించుకుని, చివరకు కలియబడ్డారు.

సాధువు వాళ్ళిద్దరినీ విడదీసి, " మీరు ఇలా పోట్లాడుకోవడం బాగులేదు, బిడ్డలారా ! ఆ మంచం మీద ఇద్దరూ పడుకుని చూడండి. ఎవరి కళ్ళకు నే చెప్పిన నిధి నిక్షేపాలు కనిపిస్తే వారిదే ఆ మంచం,'' అన్నాడు.

మిత్రులిద్దరూ మంచం మీద పడుకుని, కళ్లు గట్టిగా మూసుకున్నారు. ఎంతసేపటికీ వాళ్ళకు ఏ నిధి నిక్షేపమూ కనబడలేదు. చివరికి ప్రాణం విసిగి వాళ్ళు, కూడబలుక్కున్నట్టుగా ఒకేసారి కళ్ళు తెరిచి చూసేసరికి సాధువు లేడు, వెండి కంచం కూడా లేదు !



# నసిరుద్దీన్ శిష్యరికం

ఒక గురువు తన బడిలో విద్యార్థులను చేర్చుకుంటున్నాడు. ఖ్వాజా నసిరుద్దీన్ అతడితో, "నేనూ, మీ బడిలో చేరాలనుకుంటున్నాను," అన్నాడు.

నసిరుద్దీన్ లాంటివాడు తనకు శిష్యుడు కాబోతున్నాడని, గురువుకు సంతోషమూ, గర్వమూ ఒకేసారి కలిగాయి.

మరుసటి రోజు నసిరుద్దీన్ బడికి వెళ్ళాడు. విద్యార్థులందరూ పారలు పుచ్చుకొని మట్టి త్రవ్వుతున్నారు. గురువు మాత్రం, తన చేతితో పెద్ద బెత్తం పట్టుకొని, విద్యార్థులు చేసే పనిని గమనిస్తూ, అటూ యిటూ తిరుగుతున్నాడు. ఖ్వాజా అక్కడేవున్న మరో కర్రను చేత్తో పుచ్చుకొని, గురువుగారిని అనుకరిస్తూ, అతని వెంబడే అంగలు వేయసాగాడు. అప్పుడు గురువు, నసిరుద్దీన్‌ను ఇలా ప్రశ్నించాడు: "నసిరుద్దీన్, ఇక్కడ చదువు నేర్చుకోవాలని వచ్చావు గదా, ఎందుకు మిగతావాళ్ళలా నీవు పని చేయవు?"

నసిరుద్దీన్ ఇలా అన్నాడు: "గురూజీ, నేను నేర్చుకుందామని వచ్చింది మీ వద్దనుంచి, అంతేకాని మీ విద్యార్థుల నుంచి కాదు."

—కాకుటూరు నాగరాజరావు.





# కోమటి యుక్తి

ఒక ఊళ్ళో రంగయ్య అనే సన్నకారు రైతు ఉండేవాడు. ఒక ఏడు అతని పొలంలో వరిపైరు బాగా పండింది. రోజూ రంగయ్య పొలంలో పడుకుని కాపలా కాస్తున్నాడు.

ఒకనాటి రాత్రి నలుగురు దొంగలు రంగయ్య పొలం మీద పడ్డారు. ఇద్దరు దొంగలు గబగబా కంకులుకోసి, బస్తాలలో వేసుకుంటుంటే, మిగిలిన ఇద్దరూ చేతి కర్రలు పట్టుకుని, రంగయ్య తలవద్దా, కాళ్ళవద్దా నిలబడ్డారు.

రంగయ్య అంతా గమనించాడు, కాని ఏమీ చెయ్యలేక పోయాడు. గలాటా చేసి కేకవేస్తే తన ప్రాణానికే ప్రమాదం. అందుకని అతను కళ్ళు మూసుకుని అలాగే పడుకున్నాడు. వచ్చినపని కాగానే దొంగలు వరికంకుల బస్తాలు నెత్తిన పెట్టుకుని పారిపోయారు.

తెల్లవారి లేచి రంగయ్య చూసుకుంటే సగం పొలం నాశనమయి ఉన్నది. ఈ సంగతి ఊరంతా పాకింది. రంగయ్యను గురించి అందరూ జాలిపడి, "ఈ దొంగలు, పాపం, బీదవాడి చేలోనే పడాలా?" అనుకున్నారు. కాని దొంగలకు పొలంగలవాడు బీదవాడో, షావుకారో ఏం తెలుస్తుంది?

ఊళ్ళోని పెద్దలందరూ చేరి దొంగలను రాకుండా చెయ్యడం గురించి మాట్లాడుకున్నారు. ఈ రోజు రంగయ్య పొలం దోచినవాళ్ళు రేపు మరొకరి పొలం దోస్తారు. దొంగలు రాకుండా ఏం చెయ్యాలన్న సమస్య వచ్చింది.

ఆ వూరి కోమటి పేదవాడైనా చాలా తెలివిగలవాడు.

ఆ కోమటి ఊరి పెద్దలతో, "మీరు నిర్భయంగా ఉండండి. నాకు నాలుగు

కుమారి సురభి రేవతి

రోజులు వ్యవధి ఇచ్చారంటే, నేను దొంగలను మీముందు ఉంచుతాను,'' అన్నాడు.

''ఆపాటి పుణ్యం కట్టుకోవయ్యా. నువు దొంగలను పట్టావంటే మేమంతా చందాలు వేసుకుని నీ చేత అంగడి పెట్టిస్తాం.'' అన్నారు ఊళ్ళోవాళ్ళు.

తాను ఏం చెయ్యబోతున్నాడో శెట్టి ముందుగా ఎవరికీ చెప్పలేదు.

రంగయ్య చేను దోచిన దొంగలు గూడెం చేరుకున్నారు. దాదాపు రెండు బస్తాల ధాన్యం వాళ్ళకు దొరికింది. ఈ సంగతి వివరంగా గూడెంలో ఉండే దొంగలందరికీ తెలిసిపోయింది. మరి అయిదుగురు దొంగలు మర్నాడు రాత్రి అదే గ్రామానికి బయలుదేరారు.

కొడవలి ఒకటి చేత బట్టి, ఖాళీ సంచులు రెండు తీసుకుని, కోమటి ఈ దొంగల కోసమే ఎదురుచూస్తూ ఒక చేను దగ్గిర నిలబడి ఉన్నాడు. దొంగలను అంతదూరాన చూడగానే అతను పొలం కోస్తున్నట్టు నటించసాగాడు.

అతన్ని చూడగానే దొంగలకు అమితానందమయింది. తమకు తోడుగా మరొక దొంగ దొరికాడుగదా అనుకున్నారు. వాళ్లు శెట్టిని సమీపించి, ''ఏ వూరు నీది ?'' అని అడిగారు.

''మాది ఫలానా ఊరు. మిమ్మల్ని ఏనాడూ చూసినట్టు లేదే! మీదే ఊరు?" అని శెట్టి వాళ్ళను అడిగాడు. వాళ్లు తమ గూడెం పేరు చెప్పారు.



''త్వరగా పని కానియ్యండి. మనం దొరికి పోగలం!'' అన్నాడు శెట్టి వాళ్లతో.

దొంగలు వేగంగా కంకులు కోసి సంచులు నింపుకోసాగారు.

వాళ్ళు శెట్టితో, ''ఏం. అన్నా? ఈ పొలానికి కాపలా కూడా లేదేం? ఎంత అశ్రద్ధ!'' అన్నారు.

''ఈ పొలంగల ఆసామీ గొప్ప ధనవంతుడు. వాడికి పిల్లాజెల్లా లేరు. ఇంటి నిండా బంగారం మూలుగుతున్నది. పెళ్ళాన్ని ఒంటరిగా విడిచి, పొలం కాపలాకు రాడు. నాకు శక్తిచాలదుకాని, వాడి ఇంట్లో బంగారమంతా ఏనాడో కాజేసేవాణ్ణి,'' అన్నాడు శెట్టి దొంగలతో.

''అదేమిటి, అన్నా? నువు సరేనను. నువు రమ్మన్న రోజున మా గూడెంలో ఉన్నవాళ్లమంతా కదిలివస్తాం,'' అన్నారు దొంగలు.

శెట్టి వాళ్ళకు ఫలానా రోజు రమ్మని చెప్పాడు. దొంగలు సంతోషించి వెళ్ళిపోయారు.

శెట్టి చెప్పినప్రకారం దొంగలందరూ అతన్ని ఒక రోజు రాత్రి ఒకచోట కలుసుకున్నారు. శెట్టి వాళ్ళను తన వెంట ఒక ఇంటికి పిలుచుకువెళ్ళి, ముందుగా ఆ ఇంటివాడితో వేసుకున్న పథకంప్రకారం, ఇంటి తలుపు తట్టాడు.

ఇంటివాడు వచ్చి తలుపు తెరవగానే దొంగలు అతని నోట గుడ్డలు కుక్కి, ఒక చోట కట్టిపడేశారు. ఇంతలోనే ఒకావిడ లోపలి నుంచి వచ్చింది.

''జాగ్రత్త, పొడిచేస్తాం!'' అని శెట్టి ఆమెను బెదిరించి, దొంగలతో, "పదండ్రా లోపలికి. అంతా దోచుకురండి!'' అన్నాడు.

దొంగలందరూ లోపలికి వెళ్ళగానే శెట్టి బయటి తలుపుమూసి, తాళం పెట్టేశాడు. తరవాత శెట్టి ఊళ్ళో జనాన్నందరినీ పిలుచుకొచ్చాడు. గ్రామస్థులు దొంగలందరినీ పట్టుకుని కట్టేసి, తెల్లవారుతూనే, దొంగలను కొత్వాలుకు అప్పజెప్పి, శెట్టి చేత అంగడి తెరిపించారు.



# భార్యల పోరు

వరహాలు అనే వ్యాపారికి ఇద్దరు భార్యలు. ఇద్దరూ అస్తమానం తగువులాడుకునేవారు. ఒకరితో ఒకరు పోటీపడి ఖర్చుచేసి వాళ్ళు వరహాలుకు మనశ్శాంతి లేకుండా చేశారు. అతను తన కష్టాలను ముత్యాలు అనే స్నేహితుడితో చెప్పుకున్నాడు. ముత్యాలు అతనికి ఒక ఉపాయం తెలిపాడు.

ఒకనాడు ముత్యాలు ఒక జమీందారు వేషంలో వరహాలు ఇంటికి సపరివారంగా వచ్చి, "నా వారసురాలైన మా అమ్మాయికి రెండుసార్లు పెళ్ళి ప్రయత్నం చేస్తే, పీటల మీదనే పెళ్ళికొడుకులు చచ్చారు. ఇద్దరు భార్యలు గల వాడికి పిల్లనిస్తే అది సుమంగళిగా ఉంటుందని జ్యోతిష్కులు చెబుతున్నారు. అందుకని మా అమ్మాయిని మీరు చేసుకోవాలి," అని వరహాలును కోరాడు.

ఏ సంగతీ తరవాత కబురు చేస్తానని వరహాలు ముత్యాలును పంపేశాడు.

వరహాలుకు రాబోయే భార్య గొప్పది కనక తమ పని కట్టవుతుందని ఇద్దరు భార్యలూ గుర్తించి, ఒకరిమీద ఒకరు పోటీపడి వరహాలుకు సేవలు చెయ్య సాగారు. వాళ్ళు పోట్లాడుకోవటం కూడా మరిచారు.

—చెల్లూరి సీతారాజేశ్వరరావు.





# ఆనవాలు

ఒక ఊళ్ళో ఒక బీదరైతు ఉండేవాడు. అతను ఇతరుల పొలాలలో కూలి పనిచేసి పొట్ట పోషించుకుంటూ, పొలం పనులు లేనప్పుడు తన పశువుల పాలు అమ్ముకుంటూండేవాడు.

అతనికి కందసామీ, వీరాసామీ అని ఇద్దరు కొడుకులు ఉండేవాళ్ళు. వాళ్ళలో కందసామి, తండ్రి తిట్టాడని అలిగి, చిన్నతనంలోనే ఎటో వెళ్ళిపోయాడు.

రైతు ముసలివాడై చనిపోతూ, తన రెండో కొడుకైన వీరాసామితో, "మనకున్న ఆస్తి పది పశువులే. ఎప్పటికైనా నీ అన్న కందసామి తిరిగివస్తే, వాటిలో అయిదింటిని వాడికి నువు ఇచ్చెయ్యాలి. కందసామి ముక్కుమీద అరంగుళం నిడువుగల మచ్చ ఉంటుంది. అదే వాడికి ముఖ్యమైన గుర్తు." అని తన చివరి కోరికగా చెప్పాడు.

తండ్రి పోయాక వీరాసామి తన అన్న కోసం ఎదురుచూస్తూ రోజులు గడపసాగాడు. ఎవరైనా కొత్త మనుషులు కనిపిస్తే వాళ్ళ ముక్కును జాగ్రత్తగా పరీక్షించేవాడు. ఎందుకలా చూస్తున్నావు అని అడిగితే, "మరేమీ లేదు, పన్నెండేళ్ల క్రితం పారిపోయిన మా అన్న ముక్కు మీద అరంగుళం పొడవు మచ్చ ఉండేది. వాడు కనిపిస్తే నేను వాడికి అయిదు పశువులు ఇచ్చెయ్యాలి," అని వీరాసామి చెప్పేవాడు.

ఒకనాడు వీరాసామి పొలం పనికి పోతూండగా, అతని ఇంటికి సమీపంలోనే దారిపక్కన ఒక బిచ్చగాడిలాటి మనిషి, మట్టికొట్టుకుని, మూలుగుతూ కనిపించాడు.

వీరాసామి ఆ మనిషిని చూసి జాలిపడి, "ఎవరు నువు? ఏమిటి నీ బాధ? నీకేం కావాలి?" అని అడిగాడు.

టి. ముకుందశర్మ

''ఆకలి, బాబూ! మూడు రోజులనుంచీ అన్నమూ, నీరూ లేకుండా నడిచివస్తు న్నాను. కళ్ళు బైర్లుకమ్మి, కాళ్ళు మడత బడి పడిపోయాను,'' అని ఆ మనిషి బాధ పడుతూ చెప్పాడు.

వీరాసామి ఆ మనిషి ముక్కుమీద మచ్చ గమనించి, ''నీ పేరేమిటి?'' అని అడిగాడు. తన పేరు కందసామి అని చెప్పి, ''నేను ఇంటి నుంచి వెళ్ళిపోయి చాలా ఏళ్ళయింది. గతిలేక బిచ్చమెత్తి బతుకుతూ, నా తండ్రి దగ్గిరికి బయలు దేరాను,'' అన్నాడు ఆ మనిషి.

''నేను నీ తమ్ముడు వీరాసామిని,'' అని చెప్పి వీరాసామి, తన తండ్రి పోయిన సంగతీ, చచ్చిపోతూ అతను కందసామి వస్తే అయిదు పశువులను ఇయ్యమన్న సంగతీ చెప్పి, ఆ మనిషిని తన ఇంటికి తీసుకుపోయి ఉపచారాలు చేశాడు.

అయితే మర్నాడు వీరాసామి చూసే సరికి, ఆ మనిషీ లేడు, కొట్టంలో ఉన్న పశువులలో అయిదు కనిపించను కూడా లేదు.

తన అన్నకు తనతో కలిసి ఉండటం ఇష్టంకాక వెళ్లిపోయాడేమోనని వీరాసామి అనుకున్నాడు. కాని ఆ మాట చెప్పి మరీ వెళ్ళిపోవచ్చుగద!



''వీడు నా అన్నకాడు. ఎవరో దొంగ,'' అనుకున్నాడు వీరాసామి.

కొద్దిరోజులు గడిచాక, వీరాసామి ఇంటి ముందు ఒక బండి ఆగింది. అందులో నుంచి ఒక ధనికుడిలాంటివాడు దిగాడు. బండివాడు కొన్ని పెట్టెలూ, ఒక పళ్ళబుట్టా తెచ్చి, అరుగు మీద పెట్టాడు.

వీరాసామి ఆశ్చర్యంతో, ''ఎవరండీ మీరు? ఎవరు కావాలి?'' అని ఆ మనిషిని అడిగాడు.

''నువు వీరాసామివి కాదుట్రా? నేను కందసామిని. నువు ఎలా పెరిగావు! నాన్న కులాసా?'' అని ఆ ధనికుడు వీరాసామిని అడిగాడు.

వీరాసామి దిగ్భ్రమ చెంది, అతని ముక్కుకేసి చూశాడు. ముక్కు మీద అరంగుళం నిడివిగల మచ్చ ఉన్నది.

అయితే ముందు వచ్చినవాడు దొంగే నన్నమాట! వాడు పెట్టుకున్నది నిజమైన మచ్చే, కాదో తాను పరీక్షించి తెలుసుకోలేదు. వాడేమో పశువులను కాజేసుకుపోయాడు. ఈ వచ్చినవాడు నిజంగా తన అన్నే అయితే తాను తన తండ్రి మాట ఎలా నిలబెట్టుకోవటం?

''ఒకవేళ ఈ మనిషే దొంగేమో!'' అనుకుని వీరాసామి ఆ వచ్చినవాణ్ణి కొన్ని ప్రశ్నలు అడిగాడు. చిన్నప్పటి సంఘటనలను గురించి వీరాసామి అడిగిన ప్రశ్నలకు కందసామి సరి అయిన సమాధానాలు ఇయ్యటమేగాక, మరి కొన్నిటిని జ్ఞాపకం కూడా చేశాడు.

అప్పుడు వీరాసామి, కొద్దిరోజుల క్రితం ఎవరో రావటమూ, వాడు పశువులను తీసుకుని పారిపోవటమూ, తండ్రి చచ్చిపోతూ తన ఆఖరి కోరిక చెప్పటమూ మిగిలిన విషయాలన్నీ కందసామికి చెప్పాడు.

"ఇప్పుడు నన్ను ప్రశ్నించినట్టే నువు వాణ్ణి ప్రశ్నించి ఉండవలసింది. పశువులను గురించి దిగులుపడకు. అవి పోతే పోయాయిలే,'' అన్నాడు కందసామి.

''అలాకాదు. నాన్న అన్నట్టు జరిపి తీరాలి. నా వంతు పశువుల్ని నువు తీసుకో. నేను చేసిన తప్పుకు అదే ప్రాయశ్చిత్తం,'' అన్నాడు వీరాసామి.

కందసామి బండివాణ్ణి పిలిచి, ఊరి బయట కట్టివేసి ఉన్న పశువులను తీసుకు రమ్మనిపంపి, వీరాసామితో, ''మొన్న వచ్చిన దరిద్రుణ్ణి నేనే. నువు నా మచ్చ సంగతీ, పశువుల సంగతీ అడ్డమైన వాళ్ళకూ చెప్పావు. పరీక్షించకుండా ఎవరినీ నమ్మరాదని నీకు తెలిసి రావటం కోసమే ఇలాచేశాను. నేను మంచిస్థితిలోనే ఉన్నాను. నా ఐశ్వర్యాన్ని ఇద్దరమూ పంచుకుంటే మనతండ్రి సంతోషిస్తాడు," అన్నాడు.



# మర్యాదస్థులు

పక్కపక్క గ్రామాలకు చెందిన రామయ్యా, సోమయ్యా అనే స్నేహితులు సంతలో కలుసుకుని, తమకు కావలిసిన సరుకులుకొని బయలుదేరారు. దారులు చీలేచోటికి వచ్చేసరికి చీకటిపడింది. చీకట్లో సోమయ్యను పంపటం ఇష్టంలేక రామయ్య తోడు వెళ్ళాడు. సోమయ్య తన సరుకులు ఇంటి దగ్గిర పడేసి, రామయ్యను ఒంటిగా పోనియ్యక తాను రామయ్య ఇంటి దాకా తోడువెళ్ళాడు.

రామయ్య తన సరుకులు కూడా ఇంటపడేసి, "చాలా పొద్దుపోయింది. పద నీ యింటి దాకా తోడువస్తాను," అని సోమయ్య వెంట వెళ్ళాడు. ఇల్లు చేరుకున్న సోమయ్య రామయ్యతో, "చలి ముదిరింది. వాన కూడా వచ్చేట్టున్నది. నువు ఒంటరిగా వెళ్ళటానికి వీల్లేదు," అని రెండు కంబళ్ళూ, రెండు గొడుగులూ తీసుకుని రామయ్య ఇంటి దాకా వచ్చాడు.

ఇలా వాళ్ళు ఒకరి ఇంటి నుంచి ఇంకొకరి ఇంటికి చలిలోనూ, వర్షంలోనూ తెల్లవార్లూ తిరుగుతూనే ఉన్నారు. చివరకు రామయ్య గ్రామానికి చెందిన కరణంగారి పాలేరు సోమయ్య గ్రామానికిపోతూ, రామయ్యను వెనక్కిపంపేసి సోమయ్యను అతని ఇంటికి చేర్చాడు.

—బి. వి. రావు.





# నిరర్థకమైన ఆజ్ఞ

పూర్వం ఆదిత్యపురి అనే దేశాన్ని శూరసేనుడు అనే రాజు పాలించేవాడు. ఆయన కొడుకు చంద్రసేనుడు.

ఒకసారి ఆదిత్యపురి పైకి పొరుగురాజు దండెత్తి వచ్చాడు. ఆ సమయంలో శూరసేనుడికి జబ్బుగా ఉండటంచేత, ఆయన తన కొడుకు నాయకత్వం కింద సేనలు వెళ్ళి, యుద్ధం చేసేటట్టు ఏర్పాటు చేశాడు. చంద్రసేనుడు బయలుదేరేటప్పుడు తండ్రి అతనితో, ''నాయనా, యుద్ధానికి నాయకత్వం వహించే అనుభవం నీకు లేదు. అయితే మన సేనాపతులు అనుభవం గల వాళ్ళు. వాళ్ళ నిర్ణయాలను పాటించి, జయంతో తిరిగిరా,'' అని చెప్పాడు.

చంద్రసేనుడు తన తండ్రి మాటలను అంత శ్రద్ధగా వినలేదు. ఎందుకంటే, రెండేళ్ళ క్రితం శూరసేనుడి నాయకత్వం కింద జరిగిన యుద్ధంలో ఆయన యుద్ధరంగం నుంచి పారిపోయాడు. ఆయన వెనకనే సేనాపతులూ, సేనలూ పారిపోవటంతో శత్రువుకు ఆకస్మిక విజయం లభించింది.

ఈ సంఘటన మనసులో ఉంచుకుని చంద్రసేనుడు, నాయకుడి శౌర్య ప్రతాపాల మీదనే జయాపజయాలు ఆధారపడతాయిగాని, సేనాపతుల శౌర్యమూ, సేనల శౌర్యమూ అంటూ ఏమీలేదనే నిర్ణయానికి వచ్చాడు.

యుద్ధం ఆరంభమయింది. రెండు రోజులపాటు తమదే పైచేయిగా ఉన్నట్టు చంద్రసేనుడికి తోచింది, కాని మూడో రోజు శత్రుసేనల పరాక్రమం హెచ్చుతున్నట్టూ, తన సేనల పసతగ్గిపోతున్నట్టూ కనబడింది. ఇక అపజయం తప్పదనుకుని, అతను తన సేనాపతులతో, ''ఇక

ఆర్. సురేంద్రనాథ్

యుద్ధం చాలించి, వెనుతిరగండి. వృథా జన నష్టం దేనికి? ఇంకా హెచ్చు సేనలతో మళ్ళీ వద్దాం." అన్నాడు.

యుద్ధానుభవంగల సేనాపతులు అతనితో, "యువరాజా, ఈ సమయంలో వెను దిరగటమంటే వెన్న పడేటప్పుడు దుత్తను పగలగొట్టటమే! మనం విజయం పొందటానికి సిద్ధంగా ఉన్నాం. మీరు కాస్త విశ్రాంతి తీసుకోండి," అన్నారు.

"నా ఆజ్ఞ ధిక్కరించి నిష్కారణంగా సైన్యనష్టం కలిగిస్తారా?" అని చంద్రసేనుడు వారిని కసిరాడు.

కాని వాళ్ళు అతని ఆజ్ఞ పాటించక యుద్ధం కొనసాగించి, శత్రువుపై విజయం సాధించారు. ఇది చంద్రసేనుడికి మరింత అవమాన మనిపించింది.

విజయంతో తిరిగి వచ్చిన కొడుకునూ, సేనాపతులనూ శూరసేనుడు చక్కగా సన్మానించాడు. కాని తన కొడుకు ముఖం చిన్నబోయి ఉండటం గమనించి, ఆయన కారణం అడిగాడు.

చంద్రసేనుడు తన తండ్రితో జరిగిన సంగతి చెప్పాడు.

అది విని శూరసేనుడు చిరునవ్వునవ్వి, "నిన్నుచూస్తే నా కొక పాతకథ జ్ఞాపకం వస్తున్నది. చెబుతాను విను," అని ఇలా చెప్పాడు :



అజీకర్త గురుకులంలో విద్యలన్నీ నేర్చుకున్న మునికుమారుడు ఒకడు తన ఇంటికి తిరిగిపోతూ ఒక దేశం ప్రవేశించాడు. ఆ సమయంలో ఆ దేశంలో ఆందోళనకర పరిస్థితి ఏర్పడి ఉన్నది. శత్రుగూఢచారుల భయం కొద్దీ, ఎక్కడ చూసినా రక్షక భటులు వచ్చేపోయే వారందరినీ శ్రద్ధగా పరిశీలిస్తున్నారు.

అలాగే ఒక భటుడు మునికుమారుణ్ణి ఆపి, "నువు మిత్రుడవా? శత్రుడవా?" అని అడిగాడు.

"నేను మిత్రుడనూ కాను, శత్రుడనూ కాను," అని మునికుమారుడు వేదాంతిలాగా జవాబు చెప్పాడు.

రక్షకభటుడు వేసిన మిగిలిన ప్రశ్నలకు కూడా అతను గూఢార్థం గల సమాధానాలే చెప్పాడు. అతనిపై అనుమానం ఎక్కువై, అతన్ని తీసుకుపోయి రాజు ముందు నిలబెట్టారు. రాజు వేసిన ప్రశ్నలకు కూడా మునికుమారుడు అలాగే సమాధానాలు చెప్పాడు. అతను తప్పక శత్రువుల గూఢచారి అయి ఉంటాడనుకుని, రాజు మునికుమారుడికి మరణశిక్ష విధించాడు.

మునికుమారుణ్ణి శిరశ్ఛేదం చెయ్యటానికి తీసుకుపోతూండగా, అతనితో చదివి తన ఇంటికి తిరిగివచ్చిన అతని మిత్రుడొకడు చూసి, రాజుతో, "వీడూ, నేనూ అజీకర్తముని గురుకులంలో చదువుకున్నాం. వీడు తన దేశానికి పోతున్నాడు," అని చెప్పాడు.

రాజు మునికుమారుణ్ణి బంధవిముక్తుణ్ణి చేసి, అజీకర్తమునికి కబురు పంపాడు. అజీకర్తుడు రాగానే మునికుమారుడు ఆయనకు నమస్కారంచేసి, "తేడాలన్నీ మిథ్య అనే దృష్టితో నేను మాట్లాడే సరికి, నా ప్రాణానికే ప్రమాదం వచ్చింది," అన్నాడు.

"అది నిష్ప్రయోజనం, నాయనా. నువు అనుభవంతో మాట్లాడాలి. నువు చెప్పేది అందరికీ తెలియాలి. లేకపోతే నీ మాటకు విలువ ఉండదు," అన్నాడు అజీకర్తుడు.

శూరసేనుడు ఈ కథ చెప్పి, చంద్రసేనుడితో, "నాకు యుద్ధంలో సంపూర్ణమైన అనుభవం ఉన్నకారణంచేత నేను యుద్ధంలో వెను దిరిగినప్పుడు, నా సేనాపతులందరూ నాతోబాటు వెనుదిరిగారు. కాని నీకు యుద్ధంలో అనుభవం లేదు. అందుచేత నువు వెను దిరగమని అజ్ఞాపించినప్పుడు సేనాపతులు నీ అజ్ఞ ఉల్లంఘించారు. వ్యక్తిగతంగా నీకు అపజయం కలిగినప్పటికీ, మన సేనలు శత్రుసేనలను జయించాయి. సేనాపతులు నిన్ను అవమానించారని అనుకోకు," అన్నాడు.





# చెల్లించని మొక్కు

లక్ష్మీపురంలో ఉపేంద్రు డనే పేదవాడు ఉండేవాడు. అతనికి భార్యాపిల్లలు లేరు. ఒంటరివాడు. ఏరోజుకారోజు కూలిపని చేసుకొని, ఆవేళ సంపాదించిన డబ్బుపెట్టి తిండి తినేవాడు. ఇలా ఉండగా, ఒక నాడు వాడికి అంతులేని జబ్బు చేసింది. వైద్యుడి దగ్గరకి వెళ్ళడానికిగాని, అతడిచ్చే మందు కొనుక్కోవటానికిగాని ఉపేంద్రుడికి శక్తిలేదు. అందుకని అతడు దుర్గామాతను తల్చుకొని, "అమ్మా! ఈ జబ్బుగాని నీ శక్తివల్ల, నీ దయవల్ల నయమయిందంటే నీకు మంచి బలిసిన దున్నను బలిగా ఇచ్చుకుంటాను.'' అని మొక్కుకున్నాడు.

అలా మొక్కుకున్న తరువాత నెమ్మదిగా జబ్బు నయమయింది ఉపేంద్రుడికి. కాని అతడు మొక్కు మాటే మరచిపోయాడు. అడిగితేగాని ఇవ్వడనుకొని దుర్గాదేవి ఉపేంద్రుడికి కనపడి మొక్కు చెల్లించమని అడిగింది. దానికి వాడు గతుక్కుమని, ''అమ్మా! కటిక దరిద్రుడిని కదమ్మా! దున్నను కొనగల తాహతు నాకు లేదని నీకు తెలుసుగా? నీకు మంచి కుందేలును బలి ఇస్తాను. దున్నను ఇవ్వలేను.'' అని అన్నాడు.

ఉపేంద్రుడు ఇలా చెప్పిన తరువాత చాలా రోజులు ఎదురు చూసింది దుర్గాదేవి. ఒకమాటు జ్ఞాపకం చేద్దామను కొని ఉపేంద్రుడికి కనపడి, "దున్నను ఇవ్వలేనన్నావు, బాగానే ఉంది. కుందే లును బలి ఇవ్వడానికి ఇంకా అలస్యం దేనికి?" అని అడిగింది.

ఉపేంద్రుడికి దుర్గామాతను చూడ గానే తన మొక్కు సంగతి గుర్తుకు వచ్చింది. వెంటనే, ''తల్లీ! రోజూ

ఎన్. అరుణాశ్రీనివాస్

కుందేలు కోసం నేను చూస్తూనే ఉన్నాను. కానీ దానంత వేగంగా పరుగెత్తి దానిని పట్టుకోలేకపోతున్నాను. కుందేలు కన్నా పావురాయి మాంసం రుచిగా ఉంటుంది. అందుచేత పావురాయిని నీకు బలి ఇస్తాను," అని అన్నాడు. సరే అన్నది దుర్గాదేవి.

ఉపేంద్రుడు పావురాయిని పట్టుకొని దాన్ని బలిఇచ్చే ప్రయత్నాలేమీ చెయ్యలేదు. ఒకవేళ దుర్గాదేవి అడిగితే దానికి సమాధానం సిద్ధంగా ఉంచుకున్నాడు. మామూలుగా కూలి చేసుకుంటూ రోజులు గడిపేస్తున్నాడు.

దుర్గాదేవి మళ్ళా కనపడి తన బలి సంగతి అడిగింది. దానికి ఉపేంద్రుడు తడబడకుండా, ''పావురం ఆకాశంలో ఎగురుతుందని నీకు తెలుసుకదమ్మా! దాన్నెపుడు పట్టుకుందామన్నా రివ్వున ఆకాశంలోకి ఎగిరిపోతోంది. ఏం చెయ్యను? పోనీ తూనీగను బలి ఇవ్వనా?" అని అడిగాడు.

దుర్గాదేవి ఏదో ఒకటని సంతృప్తిపడి సరే నన్నది. నెలరోజులు దాటింది. ఉపేంద్రు డీసారి కూడా మొక్కు మాట మరచిపోయాడు. దుర్గాదేవి ఈ సారి ఆలస్యం భరించలేక ఉపేంద్రుడికి కనపడి, ''ఏమయ్యా? దున్నను బలి ఇస్తానన్నావు. కాదు కుందేలుని ఇస్తానన్నావు. అది ఇవ్వలేను పావురాన్ని ఇస్తానంటే సరేనన్నాను. అదీకాదు పోనీ తూనీగను ఇస్తానన్నావు. ఇంకా ఎన్నాళ్ళని వేచి చూడమంటావు? నా కాకలిగా ఉంది. వెంటనే బలి ఇవ్వు,'' అన్నది.

ఉపేంద్రుడు రెండు చేతులు జోడించి ఆవిడకి నమస్కారంచేస్తూ, ''తల్లీ! జగన్మాతవు. ఈ విశాల ప్రపంచంలో నీక్కావలసిన ఆహారం నువ్వు తల్చుకుంటే వస్తుంది కదా? మానవ మాత్రుడినైన నన్నడగడం, అందులో నే నిచ్చే తూనీగ ఆహారం నీకు సరిపోతుందా ఏమన్నానా?'' అని అనేసి వెళ్ళిపోయాడు.

దుర్గాదేవి నిర్ఘాంతపోయింది.






హనుమంతుడు లంకానగరంలోకి పోతూంటే అతనికి రకరకాల రాక్షసులు కనిపించారు. యజ్ఞదీక్షలో ఉన్నవాళ్ళూ, జడలు ధరించినవాళ్ళూ, తలలు గొరిగించుకున్నవాళ్ళూ, ఎద్దుతోలు కట్టుకున్నవారు, అభిచారహోమాలు చేసి శత్రువుల మీద చేతబడి చేసేవాళ్ళూ, రకరకాల ఆయుధాలు పట్టుకుని తిరిగేవారూ, వికారాకారులూ, పొట్టివాళ్ళూ, నల్లగా ఉండేవారూ, చేటల్లాటి చెవులుగలవాళ్లూ, అందంగా ఉన్నవాళ్ళూ, ధ్వజాలు పట్టుకు తిరిగేవాళ్లూ లంకలో ఉండటం హనుమంతుడు చూశాడు.

రాత్రి గడుస్తున్నది. ఆకాశంలో చంద్రుడు ప్రకాశిస్తున్నాడు. హనుమంతుడు రావణుడు ఉండే ప్రాసాదంలోకి ప్రవేశించాడు. స్త్రీలు పాడుతున్నారు. కొందరు తమ శరీరాలకు చందనలేపాలు పూసుకుంటున్నారు. కొందరు స్త్రీలు పురుషులతో విహరిస్తున్నారు. కొందరు అప్పుడే నిద్రపోతున్నారు.

తనకు కనిపించే స్త్రీలలో మనుష్యస్త్రీ అయిన సీత ఎక్కడన్నా కనబడుతుందేమోనని చాలా శ్రద్ధగా చూశాడు. కాని అతనికి సీతలాటి స్త్రీ ఎక్కడా కనిపించలేదు. హనుమంతుడికి దిగులు పట్టుకున్నది. అతను కామరూపికనక, అనుకూలమైన రూపం ధరించి లంక అంతా చెడ తిరిగి, మళ్ళీ రావణుడి గృహానికి వచ్చాడు.



రావణుడి ఇల్లు హనుమంతుడికి అద్భుతంగా కనబడింది. దాన్ని వెండితో నిర్మించి బంగారు అలంకరణలు చేశారు. దానికి రంగురంగుల తోరణాలున్నాయి. వాకిళ్ళు చక్కని అలంకరణలు కలిగి ఉన్నాయి. మేలుజాతి ఏనుగులూ, గుర్రాలూ ఉన్నాయి. మహా శూరులైన రాక్షసులు ఆ ఇంటికి కాపలా కాస్తున్నారు. స్త్రీలూ, పురుషులూ అటూ ఇటూ తిరుగుతున్నారు. వాతావరణం చాలా సందడిగా ఉన్నది. అంతటా సుఖ. సౌఖ్యాలు తాండవిస్తున్నాయి. ఆ ఇల్లు ఇంద్రభవనం లాగా ఉండి, లంకానగరానికి ఒక గొప్ప అలంకారంగా ఉన్నది.

హనుమంతుడు రావణుడి భవనం అంతటా తిరగసాగాడు. ఆ భవనంలో మంచాలూ, బల్లలూ, ఆసనాలూ, పాత్రలూ అన్నీ బంగారంతో చేసినట్టు కనిపించాయి. మణులు పొదిగిన కిటికీలలో పక్షుల పంజరాలున్నాయి. హనుమంతుడికి పుష్పకవిమానం కూడా కనబడింది. అది మొదట కుబేరుడిది. అందులో కొండలూ, భూమీ, పూలచెట్లూ, పద్మాలుగల కొనేరులూ చిత్రించి ఉన్నాయి. అది చాలా పెద్ద విమానం. అందులో ఎంతమందికైనా చోటు ఉంటుందట. ఏ ఇంటికన్న కూడా పెద్దదిగా ఉన్న ఆ పుష్పక విమానం చూసి ఆశ్చర్యపడి, హనుమంతుడు రావణుడి భవనం కలయతిరగ సాగాడు. ఎంత తిరిగినా ఆ భవనాన్ని పూర్తిగా చూసినట్టు హనుమంతుడికి తోచలేదు. అతనికి సీత మాత్రం ఎక్కడా కనపడలేదు.

రావణుడి భవనంలోగల అన్ని మందిరాలూ తిరిగి, హనుమంతుడు రావణుడి భార్యలు ఉండే అంతఃపురంలో ప్రవేశించాడు. రావణుడి స్త్రీలలో రాక్షస స్త్రీలూ, రావణుడు తన పరాక్రమంతో తెచ్చిన రాజకన్యలూ, అతన్ని వలచి వచ్చిన వారూ ఉన్నారు. అంతటా దీపాలు దేదీప్యమానంగా వెలుగుతున్నాయి.

రావణుడి అంతఃపురంలో అనేకమంది స్త్రీలు నిద్రావస్థలో ఉన్నారు. వాళ్ళు చిత్ర కంబళాల మీద, రకరకాల బట్టలూ, నగలూ, పూలమాలలూ ధరించి పడుకుని ఉన్నారు. అప్పటికి అర్థరాత్రి గడిచి ఉండటంచేతా, అందరూ బాగా తాగి వుండటంచేతా ఎక్కడ కూర్చుండినవారు అక్కడే రకరకాల భంగిమలలో ఒళ్ళు మరిచి నిద్రిస్తున్నారు.

హనుమంతుడు శ్రద్ధగా అందరి ముఖాలలోకి చూశాడు. అతను మంచం మీద నిద్రపోతున్న రావణుణ్ణి కూడా చూశాడు. రావణుడి చేతులు అయిదు తలలు గల మహాసర్పాలలాగున్నాయి. అతని శరీరానికి రక్తచందనం పూసి ఉన్నది. పెద్ద శరీరం గలిగి అతను పడుకున్న పర్వతం లాగున్నాడు. అతని శరీరమంతటా ఆభరణాలున్నాయి.

రావణుడి లాగే, అతని భార్య మండోదరి కూడా వేరే ఒక మంచం మీద పడుకుని ఉన్నది. ఆమె అందచందాలూ, యౌవనమూ చూసి హనుమంతుడు, ఆమె సీత అయివుంటుందనుకుని చాలా సంతోషించాడు.

కాని మరుక్షణమే అతని ఆనందం మాయమయింది. రాముణ్ణి విడిచిన సీత అలంకరించుకుంటుందా? ఆమెకు నిద్రాహారాలుంటాయా? ఆమె పరపురుషుడికి భార్య అవుతుందా? తాను చూసినది సీత కాదని హనుమంతుడు నిర్ణయించుకున్నాడు. అతను అక్కడినుంచి కదిలాడు.



హనుమంతుడు సీత కోసం ప్రతి పొదరిల్లూ, ప్రతి చిత్రశాలా వెతికాడు. అతనికి ఒక అనుమానం వచ్చింది: సీత చచ్చిపోయి ఉంటుందా? తనకు లోబడలేదని రావణుడు ఆమెను చంపేసి ఉంటాడా? లేక ఈ వికారాకారలైన రాక్షసస్త్రీలను చూసి సీత ప్రాణాలు పోయి ఉంటాయా? సుగ్రీవుడు పెట్టిన గడువు తీరిపోయి ఎంతో కాలమయింది గదా, సీతను చూడకుండా



ఎలా తిరిగిపోవటం? తాను ఇలాగే తిరిగి పోతే, ''నువు ఎందుకు వెళ్లి వచ్చినట్టు?'' అని అందరూ తనను అడగరా? తను ఏమని చెప్పాలి?

ఏమైనా చింతిస్తూ కూర్చోవటం వల్ల ఫలం ఉండదనుకుని హనుమంతుడు దూర ప్రదేశాలు వెతకటానికి బయలు దేరాడు. అతను ఎత్తులు ఎక్కాడు, లోతులు దిగాడు, పాతాళ గృహాలు ప్రవేశించాడు, అడవులూ, బావులూ వెతికాడు. అతనికి ఎందరెందరో రాక్షస స్త్రీలు కనిపించారుగాని, సీత మాత్రం కనబడ లేదు. అందగత్తెలు కనిపించినప్పుడల్లా అతనికి ఆశ కలిగేది; వాళ్ళు సీత కారని తెలియగానే విచారం పట్టుకునేది. సీత, రావణుడు తీసుకువస్తూ ఉండగానే మధ్యదారిలో పడిపోయిందేమో? భయపడి సముద్రంలో పడిపోయిందేమో? లేక రాముడి కోసం మనోవేదనపడి చచ్చి పోయిందో?

సీతను తాను చూడలేని పక్షంలో హనుమంతుడు సముద్రతీరాన చితి పేర్చుకుని, కాలి పోవటానికి సిద్ధపడ్డాడు. అలా కాకుండా రావణాసురుణ్ణి చంపేస్తే తగిన ప్రతిక్రియ అవుతుందని అతనికి తోచింది. లేకపోతే రావణుణ్ణి యజ్ఞపశువు లాగా పట్టుకుని తీసుకుపోయి రాముడి ముందు పెట్టవచ్చు!

ఇలా అనుకుంటున్న హనుమంతుడికి దూరంగా, ఎత్తయిన చెట్లుగల వనం ఒకటి కనబడింది. అది అశోకవనం. హనుమంతుడు ఆ వనాన్ని ఇంకా వెతక లేదు. దాని జాడ కూడా అతనికి ఇప్పుడే తెలిసింది. అక్కడకూడా సీత కోసం వెతకటానికి హనుమంతుడు నిశ్చయించు కున్నాడు.

అతను అతివేగంగా దూకుతూ అశోక వన ప్రాకారం చేరాడు. అతను తన దేహాన్ని మరింత చిన్నదిచేసి, ఆ వనంలో రకరకాల చెట్లు చూశాడు. అప్పుడే ఆరంభ మవుతున్న వసంతకాలం కారణంగా



సాలవృక్షాలూ, అశోకవృక్షాలూ, చంపక వృక్షాలూ, ఉద్దాలక వృక్షాలూ, నాగ వృక్షాలూ, మామిడి చెట్లూ, కపిముఖాలు అనే చెట్లూ, చక్కగా పూతపట్టి ఉన్నాయి. అనేక వృక్షాలకు లతలు పెనవేసుకుని ఉన్నాయి.

ప్రాకారంమీద కూర్చుని ఉన్న హనుమంతుడు చెట్లలోకి బాణంలాగా దూకి, చెట్లమీదుగా పోసాగాడు. చెట్ల మీద నిద్రపోతున్న పక్షులు కలవర పడుతూలేచి, అరిచాయి. చెట్లమీది పూలు అతని శరీరం నిండా పడ్డాయి. అతనికి ఆ అశోకవనంలో కోనేరులూ, తిన్నెలూ, వెండి బంగారాలతో అలంకారార్థం తయారుచేసిన కృత్రిమవృక్షాలూ కని పించాయి.

అశోక వనంలో ఒక క్రీడా పర్వతం కూడా ఉన్నది. దానిమీద ఎత్తయిన వింత శిఖరాలూ, అనేక రాతి ఇళ్ళూ, చెట్లూ ఉన్నాయి. దానిమీది నుంచి ఒక నది లాంటిది కిందికి ప్రవహిస్తున్నది. వనంలో ఒక దిగుడు బావి ఉన్నది. దానిచుట్టూ ఎత్తయిన మేడలున్నాయి, బంగారు తిన్నెలున్నాయి.

హనుమంతుడు దట్టమైన ఆకులుగల చెట్టు మీద కూర్చుని చుట్టూ కలయ జూశాడు. కొంత దూరంలో అతనికి తెల్లగా ఒక చైత్యప్రాసాదం కనిపించింది. ఆ అద్భుతప్రాసాదానికి వెయ్యిస్తంభా లున్నాయి. ఆ ప్రాంతంలోనే హనుమంతు డికి సీత కనబడింది.

ఆమె చిక్కిశల్యమై ఉన్నది. మాసి పోయిన పసుపు పచ్చ చీర ధరించి ఉన్నది. గొప్ప విచారంలో, కన్నీరు కార్చుతూ ఉన్నది. ఆమె చుట్టూ రాక్షస స్త్రీలు ఉన్నారు. రావణుడు ఎత్తుకుపోయి నప్పుడు హనుమంతుడు ఆమెను చూశాడు. ఆ పోలికలు కొన్ని కనిపిస్తూ న్నప్పటికీ, ఆమెలో మార్పు చాలా ఉన్నది. ఆమె ఋశ్యమూక పర్వతం మీద కొన్ని నగలు పడేసింది. అలా పడవెయ్యని

ఆభరణాలను రాముడు వర్ణించి చెప్పాడు. వాటిని హనుమంతుడు గుర్తించ గలిగాడు. అంతేగాక ఆమె పడవేసిన ఆభరణాల స్థానంలో ఇప్పుడామెకు ఏ ఆభరణాలూ లేవు. గుర్తించటం ఎంత కష్టంగా ఉన్నా, ఈమె సీతే అయి ఉండాలని హనుమంతుడు నిశ్చయించుకున్నాడు. అతనికి అమితమైన ఆనందం కలిగింది. తాను రాక్షసస్త్రీల కంట పడకుండా ఉండటానికి గాను ఎత్తుగావుండి ఆకులతో గుబురుగా వున్న కొమ్మల చాటున దాగివుండి, సీతనూ, ఆమెను చుట్టుముట్టి ఉన్న రాక్షసస్త్రీలనూ శ్రద్ధగా గమనించాడు.

రాత్రి చాలావరకు గడిచి పోయింది. రాక్షసులు వేదాధ్యయనం ప్రారంభించటం హనుమంతుడికి వినిపించింది. అదే సమయంలో మంగళవాద్యాలు మోగాయి. రావణుడు మేలుకున్నాడు. మేలుకుంటూనే అతనికి సీత జ్ఞాపకం వచ్చింది. అతను వెంటనే అలంకరించుకుని అశోకవనానికి బయలుదేరి వచ్చాడు. అతని వెంట నూరుమంది దేవతాస్త్రీలూ, గంధర్వస్త్రీలూ వచ్చారు. కొందరు స్త్రీలు బంగారు దివిటీలు పట్టుకున్నారు. మరి కొందరు చామరాలూ, విసనకర్రలూ పట్టుకున్నారు. కొందరు స్త్రీలు కత్తులు పట్టుకుని అతని వెనుక నడిస్తే, మరి కొందరు బంగారు పాత్రలలో నీరు తీసుకుని అతని ముందు నడిచారు. ఒకతె రావణుడికి గొడుగు పట్టింది.



ఆడవాళ్ళు నడిచేటప్పుడు కలిగే నూపురధ్వని హనుమంతుణ్ణి అటుకేసి ఆకర్షించింది. దీపాల వెలుతురులో అతను రావణుణ్ణి చూశాడు. రావణుడు ఏం చేస్తాడో చూడాలన్న కోరికతో అతను తాను కూర్చుని ఉన్న చెట్టుకొమ్మ మీది నుంచి కింది కొమ్మకు దిగి, తాను ఇతరులకు కనబడకుండా ఆకు గుబురులచాటున మళ్ళీ దాగి, శ్రద్ధగా చూడసాగాడు.

రావణుడు తిన్నగా వచ్చి సీత సమీపంలో ఆగాడు.

సీత రావణుణ్ణి దూరానేచూసి వణికిపోయింది. ఆమె కాళ్ళు ముడుచుకుని, రొమ్ముకు చేతులు అడ్డం పెట్టుకుని ఏడుస్తూ కూర్చున్నది. ఆమె తనకెవరైనా అడ్డపడతారా అన్నట్టు నాలుగు దిక్కులా చూసింది.

మూర్తీభవించిన శోకదేవతలాగున్న సీతతో రావణుడు ఇలా అన్నాడు:

"సీతా, నన్నుచూసి భయపడి ఎందుకు అలా ముడుచుకుపోతావు? నీ అందం చూసి మోహించాను. నన్ను స్వీకరించు. నీకు ఇక్కడ నా భయంగాని, ఇతరుల భయంగాని ఏ మాత్రమూ లేదు. నీకు నా మీద ప్రేమకలగలేదు, అందుచేత నేను నిన్ను తాకను. దుఃఖించకు. మాసిన బట్టతో, ఉపవాసాలుంటూ, తల దువ్వుకోకుండా ఇలా ఉండటం నీకు తగదు. నన్ను స్వీకరించి, పూలమాలలు ధరించు, మంచి నగలు పెట్టుకో, మేలైన మద్యాలు తాగు, మంచి మంచాలమీద పడుకో, ఆట పాటలతో కాలం గడుపు. సుఖంగా ఉండు. నీ యవ్వనం వృథాకానీకు. నీ వంటి సుందరి సృష్టిలో లేదు. నేను పరపురుషుణ్ణి అనే భ్రమ వదులుకో. నిన్ను నా పట్టమహిషిగా చేస్తాను. నీ దాసుణ్ణిగా ఉంటాను. నీకు ఏం కావాలన్నా నన్ను ఆజ్ఞాపించు. అడవులపాలైన ఆ రాముడు నీ కెందుకు? అతనింకా బతికి ఉన్నాడన్న ఆశలు పెట్టుకోకు. అతను నిన్ను చూడటానికైనా యిక్కడికి రాలేదు."



# అమరవాణి

న కశ్చి చ్చండకోపానా
మాత్మీయో నామ భూభుజాం;
హోతార మపి జుహ్వానాం
స్పృష్టో దహతి పావకః. 1

[తీవ్రమైన కోపంగల రాజులకు తనవాళ్ళూ, పరాయివాళ్ళూ అనే విచక్షణ ఉండదు. తనలో హోమం చేస్తున్నవాడు సైతం తాకితే అగ్ని కాల్చుతుంది.]

జ్వలతి చలితేంధనోగ్నిః
విప్రకృతః పన్నగః ఫణం కురుతే ;
ప్రాయః స్వం మహిమానం
క్షోభాత్ ప్రతిపద్యతే జంతుః. 2

[కాలే కర్రలను కదిలిస్తే అగ్ని మండుతుంది. పామును అదిలిస్తే పడగ విప్పుతుంది. జంతువు తరచుగా క్షోభ వల్ల తన శక్తిని పెంపొందించుకుంటుంది.]

అనిర్వేద శ్శ్రియో మూలం,
అనిర్వేదః పరం సుఖం,
అనిర్వేదో హి సతతం
సర్వార్థేషు ప్రవర్తకః. 3

[దుఃఖం లేకుండా ఉండటం సంపదకు మూలం, సౌఖ్యానికి హేతువు, ఎల్లప్పుడూ అన్ని పనులూ చెయ్యటానికి అనుకూలం.]

ప్రకృతి నియమాలు

Photo by P. Sundaram



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఏనుగు - దేవుడు

పంపినవారు :
వై. రాజ్యలక్ష్మి

Photo by S. B. Takalkar



విద్యానగర్,
హైదరాబాదు.

దేవుడి ఏనుగు

బహుమతి
పొందిన వ్యాఖ్య

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు







* వ్యాఖ్యలు సెప్టెంబర్ 20వ తేదీలోగా చేరాలి. వ్యాఖ్యలు పోస్టుకార్డు పైనమాత్రమే రాయాలి.
* వ్యాఖ్యలు ఒక్కమాటలో గాని, చిన్న వాక్యంలో గాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు నవంబర్ నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



రెండవ అట్ట:
ఇదం బ్రాహ్మం

మూడవ అట్ట:
ఇదం క్షాత్రం

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2&3, Arcot Road, Madras-600 026. Controlling Editor: 'CHAKRAPANI'

# మీ బిడ్డ సంతోషంగా ఉండాలంటే




బిడ్డ ఆపకుండా ఏడుస్తూఉంటే జీర్ణశక్తి బాగాలేదేమో! పాపకి అమృతాంజన్ లిమిటెడ్ వారి గ్రైప్‌మిక్స్చర్ ఇవ్వండి. సులినొప్పి వాయువు, అజీర్ణం పళ్లువచ్చే కాలంలో ఇబ్బందులు త్వరగా తగ్గిపోతాయి. బిడ్డ ఇంకా సంతోషంగా ఉంటుంది.

అమృతాంజన్
లిమిటెడ్

## అమృతాంజన్
## గ్రైప్ మిక్స్చర్ ఇవ్వండి

OBM-2640 TG

---

## చిన్నారి పాపల కోసం!

అందమైన కార్టూన్లతో, నాలుగురంగుల బొమ్మ ముఖ చిత్రంతో ఆకర్షణీయంగా ప్రచురింపబడిన మా నాలుగు పిల్లల నవలలు!

**అమ్మేకావాలి**
శ్రీమతి ధనం
వెల రు: 4.00

**ఉడుతా ఉడుతా హూత్**
వెల రు: 5.00

**సుఖీభవ**
పాతూరి ప్రసన్నం
వెల రు: 5.00

**బంగారు తల్లి**
పాలంకి వెంకట రామచంద్రమూర్తి
వెల రు: 5.00

మీ సమీపంలో గల పుస్తకాల షాపుల్లో పై పుస్తకాలను అడగండి! లభించకపోతే మాకు వ్రాయండి, రు: 22.00 పంపినవారికి పై నాలుగు పుస్తకములు రిజిష్టర్డు పోస్టులో పంపబడుతాయి

**నవ స్టూడెంట్స్ బుక్ సెంటర్**
ఏలూరు రోడ్డు :: విజయవాడ-2

HARIS HANDY DICTIONERY
PRICE. Rs.3-30

